అతడు జీవిత పథంలో

వెనుతిరిగి చూడని వీరుడు!







1980 నవంబర్ సంచికతో

అందించబడిన పూర్తి నవల

వాకాటి పాండురంగారావు

రచన

# మబ్బు వీడిన సూర్యుడు

1952 సంవత్సరం డిసెంబర్ 15వ తేది.

యాభై ఎనిమిది రోజుల ఉపవాసదీక్ష అనంతరం శ్రీ పొ
శ్రీరాములు మరణించారు:

మద్రాసు నగరంలో ఆయన కన్నుమూసిన బులుసు సాం
మూర్తి గారి ఇంటి ఆవరణలో లేచిన ఆంధ్రుల కోపపు చిచ
ఆకాశాన్నంటే శిఖయై ఢిల్లీని తాకింది.

o o o o

శ్రీరాములుగారు కన్నుమూశారనగానే మద్రాసులోని ప్ర
తెలుగువాడూ ఏదో పోగొట్టుకున్నట్లు వెర్రివాడిలా మైలాపూర్ వై
పరుగెత్తడం ప్రారంభించారు.

ఆ తెలుగు తపస్వి అర్ధరాత్రివేళ దేహాన్ని వదిలా
ఉదయం సూర్యుడింకా రాకముందే లక్షలాది జనులక్కడ క్రిక్కి
పోయారు.

చాలమంది యువకులు, పెద్దలు కోపావేశాలతో మద్రాసు
రంలో హర్తాళ్ జరపాలని నిశ్చయించారు. మైలాపూరులో, మౌం
రోడ్‌లో, జార్జిటవున్‌లో, చైనాబజారులో దుకాణాలకు అడ్డ
వేసుకున్నారు. వచ్చేపోయేవారిని దుకాణాల్లో యేమీ కొవ
చేసుకున్నారు.

రతన్‌బజార్‌లోని హర్తాళ్‌కు నాయకత్వం నాగన్న వహి
చాడు.

ఆ పగటి ఎండంతా అతనిమీదే. ఆ బజారు ధూళి అంతా అతనిదే. "ఆ మహానుభావుడు ప్రాణాలు అర్పిస్తే నా భాష కోసం, నా రాష్ట్రంకోసం నేనీమాత్రం చేయలేకపోతే ఎందుకు బతకడం?" అన్న ఆవేశంతో, ఉద్వేగంతో నాగన్న ఆనాడు పని చేశాడు. ఆ ప్రాంతంలో చాల దుకాణాలు మూయించగలిగాడు.

మధ్యాహ్నం భోజనాల సమయానికి నాగన్న హఠాత్తుగా డ్యూటీ మానేసి మైలాపూర్ చేరాడు.

అక్కడ, అదిగో ఆ బంగ్లా గుమ్మం, యాభై రెండు రోజులపాటు తన శరీరంలోని కణాల నొక్కొక్కటిగా ఆహుతిచ్చినవాడు అమరుడై పడుకుని వున్నాడు!

జనసముద్రం మధ్యగా వేదికమీద ఆ పాంచభౌతికమైన శరీరం!

ఏ శరీరం కాపాడే నిమిత్తమై మామూలు మనిషి మందులు, ఆస్పత్రులు, శస్త్రచికిత్సలు అంటూ పరుగులిడతాడో, దేని సుఖం నిమిత్తం నీతి నిజాయితీలను సైతం విసర్జించి పరుగులిడతాడో___ ఆ శరీరాన్ని తృణప్రాయంగా తనవారికోసం విసర్జించిన ఋషి.... అదుగో అక్కడ....

అందరి కళ్ళల్లోను మూగవేదన, సరయిన నాయకత్వం లేని ఆగ్రహం! అదే సమయంలో ఒకానొక యోగి, ఒక మహా పురుషుడు చేసిన అత్యున్నతమైన త్యాగం అన్నది ఒక మహాపునీతమైన శక్తిగా, ఒక అదృశ్యమైన 'స్పిరిట్'గా మారి వాతావరణంలో కలవగా, అందరినీ ఆవహిస్తున్న ఏదో తెలియని ఉన్నతభావం.

నాగన్నదీ బడుగు శరీరమే....

ఎంతటి భీముడినయినా ఓ రెండేళ్ళు కంపోజిటర్‌గా వుంచండి. వాడు బాధాసర్పదష్టుడయిన సగటు భారతీయుడికి చక్కటి ఉదాహరణగా తయారవుతాడు. పాలూ, వెన్న, చాక్లెట్లు, కోడిగుడ్లు తిని, జూసులు, బీరులు తాగి బలిసిన బకాసురులు, వాళ్ళ సంతతివారైన వనితామణులు "ఎలాగ సన్నపడ్డం? ఎలాగ చిక్కడం? ఎలాగ బరువు తగ్గడం_" అని బ్రహ్మ ప్రయత్నాలు చేస్తుంటారు, కాని సన్నపడరు! అలాటివారికి ఒకటే మందు!

ఆర్నెల్లపాటు సరిగా గాలీవెలుతురూలేని ముద్రణాలయంలో కంపోజింగు సెక్షన్‌లో పనిచేయమనండి. చచ్చినట్లు సన్నబడతారు.

చర్మాన్ని పలకరించే ఆ ఎముకలు చెప్పే గాథలు 'అధికార రోగపూరిత బధిరాంధక' శవాలు వినకపోగా పోగా - అలిసిపోయి, వలభై నిండకముందే వార్థక్యం వచ్చే జీవితాలు అవి: ఇవాళ్టి కన్న రేపు తప్పక బాగుంటుందిలే అని ఈదుకు వెళ్ళే బ్రతుకులు అవి.

నాగన్న బాగా అలసిపోయివున్నాడు. భోజనం మాటే గుర్తు లేదు.

ఆ మధ్యాహ్నం బయలుదేరిన ఆ అశేష ఆంధ్రజనుల ఊరేగింపుతోబాటు తానూ బయలుదేరాడు,

కదలిన కడలి అది.

కడలి నురగలా, శుభ్రజ్యోత్స్నలా అమరవీరుడి శరీరం.

ఊరేగింపు మవుంట్ రోడ్ మలుపుదగ్గరకొచ్చింది.

జనంలో కలకలం బయలుదేరింది.

"కొట్టండి!"

"చంపాలి!"

"తెలుగువాళ్ళేనా వీళ్ళు...."

"ఇది ఆంధ్రులది కాదు...."

అంటూ అరుపులు, కేకలు, తిట్లు:

ఆ మూలగా ఒక దినపత్రిక కార్యాలయం.

అంతకుముందు రోజువరకు శ్రీరాములుగారు దినదినమూ వ్యయంగా తన క్షీణిస్తున్న దేహపరిస్థితి గురించి రాసి పంపితే అయిదో పేజీలో లక్స్ సోప్ ప్రకటనమీద ఒక అంగుళం మేర ఆ వార్తను ప్రచురించిన ఆంధ్రుల అభిమాన దినపత్రికలలో ఒక దాని కార్యాలయం!

ఊరేగింపు దాటింది

సాయంకాలానికి అది జార్జిటవున్‌లోని అణ్ణాపిళ్లే వీధిలో శ్రీరాములు జన్మించిన ఇంటివైపుగా సాగింది.

అపాటికి నెల్లూరు దగ్గరనుండి హుటాహుటిన కారుమీద వచ్చిన ముసలి సింహం, ఆంధ్ర కేసరి, టంగుటూరి ప్రకాశం

ఆ ఊరేగింపుకు ముందున్నాడు.

ఆదియప్పనాయక వీధిలో అదొక హోటల్. ఆ హోటల్ ముందుగా ఇరవై అడుగుల వర్ణచిత్రం: దానిలో గాంధీ, నెహ్రూ, రాజాజీ! ఈ వూరేగింపును చూడగానే ఎందుకయినా మంచిదని ఆ చిత్రాన్ని తొలగించివేశాడు ఆ హోటల్ యజమాని!

నాగన్నలు విజయ గర్వంతో నవ్వుకున్నారు....

ఆ సాయంకాలం సూర్యుడు ఆంధ్రుల శోకతప్తమయిన ముఖాలను చూడలేక తన మొహాన్ని చాటుచేసుకున్నాక, పడమటి ఆకాశం ఎర్రగా మండి నల్లగా మాడిపోయినాక– ఆరాత్రి తొమ్మిది గంటలవేళ....

పురశవాకం దగ్గర స్మశానంలో

అగ్నిదేవుడు శ్రీరాములు శరీరాన్ని తనలోకి తీసుకున్నాడు.

ప్రకాశం ఆంధ్రులతీరనికోరికను ప్రతిబింబిస్తూ మాట్లాడాడు.

ఏమవుతుంది? ఆంధ్ర రాష్ట్రం వస్తుందా? కేంద్రం నిద్ర మేలుకుంటుందా?

ఉడికే మనసులతో, అలసిన శరీరాలతో కాళ్ళీడ్చుకుంటూ ఇళ్ళకు బయలుదేరారు జనం.

వలభై ఏడేళ్ళు నడిచిన శరీరం, ఆ ఒక్కరోజు పాతికమైళ్లు నడిచిన శరీరం – "ఇంక నడవలేను నాగన్నా!" అంది.

అతడు పడిపోయాడు రోడ్‌మీద. తనను కన్నవాడు అస్తమించాడని సూర్యానికి అర్ధరాత్రప్పుడు తెలిసింది.

o o o o

దుర్గ మండిపడుతోంది,

ఆమె మనసు నిప్పులమేకులమీద ప్రళయతాండవంచేస్తుంది.

"ఛీ! వీళ్ళు మనుషులా!" అని ఉడికిపోతోంది.

ఆమె పదిహేడేళ్ళ జీవితంలో అది మొదటి అగ్నిపరీక్ష....

ఆమె అక్క సుధ నిజంగా అమృతం లాంటిది. తన పదో ఏట అమ్మ, ఆ తర్వాత రెండేళ్ళకు నాన్న పోతే– చెల్లెలిని తల్లిగా సాకిన ప్రేమమూర్తి. అట్లాంటి సుధను ఈనాడు దుర్గ కసితో ద్వేషించే పరిస్థితి ఏర్పడింది.

ఆ పరిస్థితికి కారకుడు నారాయణ.

మేనమామ యింట్లో పెరుగుతున్న సుధను నారాయణ పెళ్లి చేసుకుని యింకా ఆరేళ్ళు కాలేదు.

ప్లీడరు గుమాస్తాగా నెలకు వందా యాభై తెచ్చుకుంటున్న, అనారోగ్యపు అనాకారి అయిన నారాయణ, సుధను భార్యగా కోరడంలో ఆశ్చర్యం ఏమీ లేదు కాని తెల్లగా నాజూకుగా వుండే పద్దెనిమిదేళ్ళ సుధ నారాయణను తప్ప ఇంక ఎవరినీ పెళ్ళిచేసుకోననడమే ఆశ్చర్యం.

"అమ్మా సుధా! నారాయణ మన బంధువే! నీవంటె మోజు పడుతున్నాడు నిజమే! అయినా అతని అలవాట్లు, ఆరోగ్యం మంచివి కావు...." అని అత్తయ్య హెచ్చరించింది.

"తల్లీ దండ్రీ లేని పిల్లను ఎవడో ఒకడికి కట్టబెట్టేసి తమ బాధ్యతను వదిలించుకున్నారన్న మాట రాకూడదు" అన్నాడు మామయ్య: అవతలివాళ్ళ జీవితంకన్న మన మంచి పేరు ముఖ్యం అనుకునే జాతి మనిషి మామయ్య.

అయినాసరే నారాయణనే పెళ్ళాడింది సుధ. మొదటి బిడ్డగా దుర్గను జాగ్రత్తగా పెంచి పెద్దచేయాలని సంకల్పించింది. మరి, ఒక్క దుర్గను పెంపడంలో ఆమెలోని మాతృహృదయానికి తృప్తి లేదేమో. బలహీనుడయిన నారాయణా తనకింకో బిడ్డవుతాడని ఆశించిందేమో.... ఏరి కోరి వరించింది.

సుధా, నారాయణల పెళ్ళి నిరాడంబరంగా తిరుచానూరులో జరిగింది. పదకొండేళ్ల దుర్గ సంతోషంతో ఎగిరి గెంతేసింది. బాజాను బలే ఏపించింది. పెళ్లి పందిరంతా మెరుపుతీగలా తిరిగింది.

మొదటి రాత్రే — దుర్గ బాధ్యత విషయం ప్రస్తావించింది సుధ, నారాయణతో.

"అది మనతోనేవుంటుంది. దానిని కనీసం ఎస్.ఎస్.ఎల్.సి, అయినా పాస్ చేయించాలి." అని సుధ అంటే — "తప్పకుండా వుండనీ! ఇప్పటినుండి ఇంట్లో సందడికోసం మనం పిల్లలు అంటూ బయలుదేరక్కర్లేదు" అన్నాడు నారాయణ కొంటెగా.

సిగ్గుతో ముడుచుకుపోయింది సుధ.

— ఆరేళ్ళ వైవాహిక జీవితం ఆమె పాలిటి నందనవనమై వికసించలేదు.

ఏడాదిలోపుగానే కొత్త కాపురం పాతదయింది. చీటికిమాటికి నారాయణ కోప్పడ్డం మొదలుపెట్టాడు. అతను తాగుతాడని సుధకు పెళ్ళికి ముందరే తెలుసును గాని, దానిని తాను ఆపుచేయగల నను కుంది. ఆ భ్రమ తొలగిపోవడానికి ఏడాది కూడా పట్టలేదు.

"ఇది నాకన్న ముందు వచ్చింది. నీ అక్కలాటిది: దానిని పొమ్మనే హక్కు నీకు లేదు" అని సారాయికుండ బద్దలుకొట్టి మరీ చెప్పిన చీకటి రోజు – సుధ దాంపత్య జీవనంలో కృష్ణపక్షానికి నాంది పలికిన రోజు.

చాలని ఆదాయం. అంతంతమాత్రమైన ఆరోగ్యం: ఆదాయాన్నీ ఆరోగ్యాన్నీ దెబ్బతీసే అలవాట్లు – అన్నీ కలిసి నారాయణను క్రమంగా విచక్షణలేనివాడిగా చేశాయి.

ఆ రోజు—

జీతంరోజు– అప్పులవాళ్ళందరికీ నెలమొదవునా సుధ ఎదురు చూడమని చెప్పిన రోజు, నారాయణ తప్పతాగి ఇంటికొచ్చాడు. జీతం రెండు వందలలో యాభై రూపాయలు తగ్గివుండడం చూసి సుధ ఉక్రోషంతో—

"ఏమండీ! యాభై రూపాయలకూ తాగారా?" అని అడిగింది.

జవాబు లేదు.

"జవాబు చెప్పరేమండీ: నెలంతా గడపాల్సిన రెండొందలలో నాల్గోవంతు ఒకేరోజు తగలెడితే ఎలాగండీ?"అని అడిగింది.

సుధ చెంప ఛెళ్ళుమంది,

దుర్గ మనసు భగ్గుమంది.

ఆ మరునాటినుండి అక్కయ్య ఎంత చెప్పినా వినకుండా చదువు మానేసింది దుర్గ.

దగ్గర్లోవున్న మహిళామండలిలోని కుట్టుపని కేంద్రంలో చేరి మూడు నెలలలోనే ఆ విద్యలో ప్రావీణ్యం సంపాదించింది. రవికలు, ఫ్రాకులు, పిల్లల దుస్తులు కుట్టడం మొదలుపెట్టింది. నెలకో పాతికో నలభైయో తెచ్చి అక్కయ్యకివ్వసాగింది.

"అయ్యో! నిన్ను సరిగా చదివించలేకపోయాను. నీసరదాలు ఏవీ తీర్చకుండా ఇప్పటినుంచే నీ ఆర్జన తినడం మొదలుపెట్టాను. పూర్వజన్మలో ఏం పాపం చేసుకున్నానో...." అన్న సుదక్కయ్య నోటిని మూయగల్గింది దుర్గ, కాని ఆమె కన్నీళ్లాపలేకపోయింది.

ఆ కన్నీళ్లు లావాగా మారడానికి మరెంతోకాలం పట్టలేదు,

ఒకనాటి రాత్రి తాగి వచ్చి పడుకున్నాడు నారాయణ.

"ఏమండీ! భోజనం చెయ్యండి!" అంది సుధ.

"నాకొద్దు!"

"ఏం.... నామీద కోపమా?"

"హహహ్హ! కోపం... ఎందుకు.... నాకు కోపంలేదు, తాపం వుంది, తీరుస్తావా భామా?" అన్న నారాయణ చూపుల్లోని ఎర్రదనాన్ని సరిగా అర్థంచేసుకోలేదు సుధ,

దాంపత్య జీవితానికి శారీరకసుఖం అవసరమే గాని అదొక్కటే దాంపత్యం కాజాలదు. అది పునాదిగా విస్తరించి ఆ అనుబంధం మంచి గంధమై జీవితంలోని ప్రతి క్షణాన్ని పరిమళభరితం చేయాలి. కొన్నాళ్ళకి శరీరాలు కాలంవేడికి కరిగిపోతాయి, కాని సహజీవన సౌందర్యం, స్నేహం, తన్నర్థం చేసుకోవడానికి విశాల ప్రపంచంలో ఇంకెవ్వరూ లేకపోయినా ఒక్క వ్యక్తి వున్నారన్న నిండుదనం మిగులుతాయి. ఆ అర్ధనారీశ్వరత్వం లభించేది ఎవరో కొందరికే!

ఈ సహజీవన యాత్రలో— తన చేతిని పట్టిన చేయి తన్నొదిలివేసిందని తెలియడానికి సుధకు రెండేళ్ళుపట్టింది.

ఆమె శరీరం మాత్రం విద్యుక్తధర్మంగా సంసారధర్మాన్ని నిర్వర్తిస్తూంది.

ఆ కాసేపు ఆమె పిచ్చిమనసు— లాలనకోసం, ఆర్ద్రత కోసం, మాటలను చేతలను దాటిన బంధంకోసం ఎదురుచూచేది. కాని అవతల వున్నది మనసులేని శరీరం; ఆ శరీరానికి కావలసింది ఇంకొక శరీరం.

అంచేతే సుధ కూడా శరీరం కాపాగింది. అందుచేతనే ఆ రాత్రి కూడా అతడి కోరిక వినగానే మనసును ఆకాశంలోకి విసిరే

పించి. శరీరం మాత్రం మిగిలింది.

"ఓహ్! ఏమిటింత భక్తి విధేయతలతో...." విషపు నవ్వు నవ్వాడు నారాయణ.

"ష్.... అవతల దుర్గ వింటుంది. ఏమిటా మాటలు?"

"దుర్గ!" అన్న పేరుని ఒక స్వీట్ తిన్నట్లుగా నాలుకమీద దొర్లించి నారాయణ అడిగాడు. "సుధా! నువ్వు మంచిదానివికదూ?"

సుధకు అర్థంకాలేదు.

"నేనడిగింది ఇస్తావుకదూ?"

సుధ పలకలేదు.

"నువ్వు ప్రేమించి, పెళ్ళిచేసుకున్న ఈ భర్త కోరిక తీరుస్తావుకదూ?"

'ఏమిటది?. అని అడిగాయి ఆమె కళ్ళు.

"ఎన్నాళ్ళనుండో నా మనస్సు తహతహలాడుతోంది. అందిన మాని పండుకు అర్రులు చాపకుండా వుండగల పురుషోత్తముడిని కాను...."

"ఏమిటండీ.... మీ మాటలు...."

"చెప్పనా? నాకు దుర్గ కావాలి!"

సుధ చెవులు బద్దలయ్యాయి.

ఇది కౌరవ సభనా, వీడు దుశ్శాసనుడా, నేను ద్రౌపదినా అన్పించింది. ఈ వేడి వేడి సీసం కాచి నా చెవుల్లో పోసింది ఇతడేనా అన్పించింది.

"నాకు దుర్గ కావాలి.... చెప్పు సుధా! నువ్వు చెప్పు. ఒక్కసారి సుధా! నేను బావనే కదా...."

"ఛీ నీచుడా!"

సుధ రెండు దవడలూ పేలాయి. ఆమె గాజులతో పాటు మనసూ విరిగింది.

ఆ రాత్రి బయటకొచ్చింది సుధ. దుర్గ అంతా విన్నదేమో నని భయపడింది. దుర్గ హాయిగా నిద్రపోతూండడం చూసింది. చెదరిన ఆమె ముంగురులను సవరిస్తూ "చెల్లీ!" అని మౌనంగా రోదించింది.

ఏదో గొడవయిందని పర్నాడు దుర్గ గ్రహించింది. అడిగింది. కాని సుధ ఏమీ చెప్పలేదు.

అక్కడ నుండి రోజూ సుధ ప్రాణాలు తోడేయటం మొదలుపెట్టాడు నారాయణ.

ఒకరోజు చేతిలో చిన్న బాటిల్ పెట్టుకుని నారాయణ బెదిరించాడు— "ఇవాళ రాత్రి నా కోరిక తీర్చకపోతే ఇదుగో, ఈ విషం తాగి చస్తా" నన్నాడు.

సుధకు మతిపోయింది. అతడు చచ్చిపోతానన్నాడనే భయం పట్టుకుంది. వెళ్ళి చెల్లెలి పాదాలమీద పడింది. "నా మొగుడిని కాపాడు!" అని వేడింది.

మొదట ఏమీ అర్థంకాలేదు దుర్గకు. ఏడుపులో ఏడుపుగా సుధ చెప్పగా విన్న దుర్గ అపర దుర్గావతార మెత్తింది.

"ఛస్తే చావనీ! నీకెలా నోరొచ్చింది అడగడానికి?" అవి అక్కయ్యమీద మండిపడింది. ఆమె మనసు నిప్పుల మేకుల మీద ప్రళయ తాండవం చేసింది....

అసరికే నారాయణ కల్లుపాక దగ్గర వున్నాడు.

అతడు తెల్లవారుజామున ఇంటికి వచ్చేసరికి చిన్న సీసా నేలమీద వుంది. సీసాలోని విషం సుధలో వుంది.

అక్కయ్య శరీరంమీద పడి రోదిస్తున్న దుర్గ - అతడిని చూడగానే 'ఛూ' అని వుమ్మేసి లేచి వెళ్ళిపోయింది.

అక్కయ్య శరీరం బూడిదయ్యే క్షణానికి దుర్గ కుట్టుపని కేంద్రం సూపరింటెండెంటు తాయారమ్మ ఇల్లు చేరింది.

నెలకాకముందే తాయారమ్మద్వారా ఆమెకు కర్నూలులోని వనితా శరణాలయంలో కుట్టుపని టీచర్‌గా ఆశ్రయం దొరికింది.

ం ం ం ం

నాగన్న చనిపోయేనాటికి అతడి కొడుకు సూర్యానికి పదహారేళ్ళు. అపాటికి సూర్యం ఎసెసెల్సీ పాసయి ఎల్. పి. టి. చదువుతున్నాడు. ఆ చదువు మొదటి సంవత్సరం మధ్యలోనే నాగన్న మరణించాడు.

సూర్యానికీ, అతడి తల్లికీ - సూర్యం బాబాయి ఆశ్రయం

ఇచ్చాడు. కష్టపడి మూడేళ్ళలో ప్రింటింగ్ టెక్నాలజీ చదువు పూర్తి చేశాడు సూర్యం. మౌంట్‌రోడ్‌లోని ఒక పెద్ద ప్రెస్‌లో చేరాడు.

మొదటి జీతం తెచ్చి తల్లి చేతికిచ్చాడు. ఆమె అందులోంచి రూపాయితీసి తంగసాల వీధిలో వున్న చిన్నకదమ్మ గుడివద్దకి కెళ్ళి కొబ్బరికాయ కొట్టింది. మరొక రూపాయిని చిల్లర మార్చి భిక్షగాళ్ళందరికి పంచింది 'ఈనాడు ఈ బిడ్డను కన్న తండ్రి వుంటే చూచి ఎంతగా మురిసివుండునో కదా' అని కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. అతడి తలను వెర్రిగా మూర్కొంది.

అయితే ఏడాది తిరక్కుండానే ఆమె కూడా మరణించడంతో సూర్యానికి తాను ఒక్కడే ఈ వూరిలో వుండలేనన్పించింది.

1953 అక్టోబర్‌లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ఆంధ్ర కేసరి ముఖ్యమంత్రి అయ్యారు. రాజగోపాలాచారి కుయుక్తుల ఫలితంగా ఆంధ్రులు మద్రాసు నుండి వలస వెళ్ళవలసి వచ్చింది. తెలుగు రాజులు ఈస్టిండియా కంపెనీ వారికి ధారాదత్తం చేసినది. ముత్తరాజు చెన్నప్ప పేరిట చెన్నపట్టణంగా రూపొందినది, తెలుగువారు తమ వ్యాపార కౌశలంతో అభివృద్ధి చేసినదీ అయిన మద్రాసు నుండి కాందిశీకులవలె తెలుగువారు తరలిపోయారు. మద్రాసు కోసం ఒక్కడై నిలబడి పోరాడిన ప్రకాశం ప్రయత్నం వమ్మయింది. తమిళ నాయకులతో కలిసి కొందరు తెలుగు నాయకులు "మదరాసుపై మాకు హక్కు లేదు" అని బహిరంగంగా ప్రకటించి తెలుగువారికి వెన్నుపోటు పొడిచారు. ఆంధ్రులు మద్రాసును వదలాల్సి వచ్చింది.

ఆంధ్ర రాష్ట్రానికి రాజధాని ఏది అన్న ప్రశ్నకు మూడు కోట్ల సమాధానాలు లేచాయి. మాజీపేట దగ్గరనుంచి విశాఖపట్నం దాక, రాయచోటి దగ్గర నుంచి రాజమండ్రి దాక ఏ వూరి వారికా వూరివారే—"మా వూరిలో రాజధానికి కావలసిన హంగులన్నీ వున్నాయి" అని ప్రకటనలు చేయసాగారు. 'అబ్బా, ఆంధ్రదేశం ఇన్ని నగరాలతో ఇంతగా అభివృద్ధి చెందివుందని మాకు తెలియదే!' అని దేశం ముక్కుమీద వేలువేసుకుంది. కాని ఏ తెలుగు

పట్నానికి వెళ్ళినా ముక్కు మూసుకునే బతకాలని మాత్రం దేశానికి తెలియదు.

ఈ గందరగోళంలో_ తెలుగుదేశపు శాసనసభ్యు లందరినీ_ మద్రాసులోని శాసనసభా ప్రాంగణంలోని ఒక భవనంలోకి చేర్చి, వారందరినీ ఓపికగా విని. వారికి నచ్చజెప్పి— 'కర్నూలు' ఆంధ్ర రాష్ట్రానికి తాత్కాలికంగా రాజధాని అన్న నిర్ణయానికి వచ్చేటట్లు చేశాడు ముసలాయన ప్రకాశం. ఆ తరువాత హైదరాబాద్ రాజ్యంలోని తెలంగాణా కూడా కలిసి విశాలాంధ్ర ఏర్పడినప్పుడు—రాష్ట్ర రాజధాని కర్నూలు నుండి హైదరాబాద్‌కు తరలుతుంది— అని కూడా నిర్ణయించారు.

శతాబ్దాల తరబడి నిద్రపోతున్న కర్నూలు అనే ఒక జిల్లా కేంద్రానికి హఠాత్తుగా రాష్ట్ర రాజధాని నగరంగా పట్టాభిషేకం జరిగింది. ఉన్న పెద్ద భవంతులలోకి కార్యాలయాలను తరలించారు. అక్కడ మదరాసు ఆఫీసులలో టేబిళ్ళు, కుర్చీలు, ఫ్యానులు, పెన్సిళ్ళు— ఇలాగ ఆఫీసు ఆస్తిపాస్తులు విభజించడంలో కూడా అరవవాళ్ళు తమ అసమానమైన ప్రతిభా విశేషాలను ప్రదర్శించారు. కొత్తవి, బాగున్నవీ తాము తీసుకున్నారు; విరిగినవి, పాతవి ఆంధ్రు లనబడే అనాథల మొహాన పడేశారు. "తీసుకుంటే తీసుకోండి. లేకపోతే పొండి" అన్నారు. కొన్ని శతాబ్దాల తరబడి నిర్మించిన మదరాసు నగరాన్ని రూపాయి నష్టపరిహారం కూడా కోరకుండా అరవలకు ధారాదత్తం చేసిన త్యాగమూర్తులయిన ఆంధ్రులు విరిగిన కుర్చీలనూ, చినిగిన ఫైళ్ళనూ ఎందుకు వద్దంటారు? మీరిచ్చిందే మహాభాగ్యం అని ఆ కాళ్ళువిరిగిన ఫర్నిచరను నెత్తిని మోసుకుని కర్నూలు చేరారు.

భారతదేశ చరిత్రలో, బహుశ తుగ్లగ్ హయాము తర్వాత_ లక్షల సంఖ్యలో కుటుంబాలు వలస వెళ్ళినది 1947 లోనే. స్వాతంత్ర్యం రాగానే మతోన్మాదులు పెట్టిన చిచ్చుల ఫలితంగా లక్షలకొలది అమాయక ప్రజలు ఆహుతి అవగా మిగిలినవారు ఇండియా నుండి పాకిస్తాన్‌కు, అక్కడినుండి ఇక్కడికీ వెళ్ళారు.

ఆ తర్వాత అంత భారీ ఎత్తున జనం వలస వెళ్ళింది_

1956 లో మద్రాసు నుండి ఆంధ్ర రాష్ట్రం విడిపోయినప్పుడే.

బహుశ, సివిలియన్ పౌరులు దాదాపు లక్షమందిదాక, శాంతి కాలంలో, గుడారాలలో కాపురాలు చేసిన సంఘటన ప్రపంచంలో ఒకచే వుంది; అది మదరాసు నుండి తరలివచ్చిన ఆంధ్రులు తాత్కాలిక రాజధాని అయిన కర్నూలులో టెంట్స్‌లో వుండడమే.

తెలిసినవారు, బంధువులు, మిత్రులు—అనేకులు మద్రాసు వదలిపోతుంటే సూర్యానికి ఏడుపు వచ్చింది. ఈ వూళ్ళో ఇంక తెలుగువాడు బ్రతకలేదేమోనన్న భయం ఏర్పడింది. ఎవరికీ చెప్పుకోలేనట్టి అవమానం లాటిది కల్గింది.

తానూ మదరాసు వదలి వెళ్ళాలనుకున్నాడు. తెలిసిన మిత్రుడు కర్నూలులో ఒక ప్రెస్‌లో ఖాళీ వుందంటే సూర్యం మదరాసు వదిలాడు.

ఆఖరిసారిగా మద్రాసు బీచికెళ్ళి ఆ ఇసుకలో కూచున్నాడు.

చిన్నప్పటినుండి తానెరిగిన సముద్రం— తానాడిన ఇసుక, తాను సైకిలు నేర్చుకున్న రోడ్, తాను స్నానాలుచేసిన సముద్రం— ఏదో తెలియని ఆవేదన అలలు అలలుగా లేచి అతడి మనసును మోదింది.

అతడి కళ్ళవెంబడి నీటిబొట్లు రాలాయి; ఇసుకలోకి జారాయి.

నిరంతరం తాను రుచిచూసే సాగర జలమూ, ఈ కొత్త నీరూ ఒక్కలాగే వున్నాయే అనుకుంది ఇసుక.

కన్నీళ్ళింకిపోయాయి.

సూర్యం లేచాడు.

మరుసటిరోజు కర్నూలుకు బయలుదేరాడు.

o o o

సాయంకాలం పని ముగిశాక సూర్యం ఇంటికి బయలుదేరాడు. కొండారెడ్డి బురుజు వద్ద "సిటీ బస్" అనబడే డొక్కు బండి ఎక్కి "ఏ" కేంప్ దగ్గర దిగాడు.

అక్కడ జనరల్ ఆస్పత్రి ఎదురుగా విశాలంగా పరచుకుని వుంది ఆ గుడారాల వాడ.

అది ఏప్రిల్ నెల. గుడారాలు చల్లగా వుండాలని వాటి మీద

మిట్టమధ్యాహ్నం ఫైరింజన్లతో నీళ్ళు చల్లించే వారు. ఆ చల్ల దనం ఒకటి రెండు గంటల్లో హరించుకుపోగా యథాప్రకారం వేడిగా, ఎడారిలో ముడుచుకుని కూచున్న వందలాది ఒంటెలలా వున్నాయి ఆ డేరాలు. వాటిలో మళ్ళీ వర్గ విభజనలు! ఒకదాని వెంట ఒకటిగా జంటగా వున్న డేరాలు ఆఫీసర్లవి; విడి విడిగా వున్నవి మిగతా వారివి. ఆ గుడారాలకు తలుపులు లేవు. పొడుగ్గా పరదాల్లా వేలాడుతున్న దళసరి గుడ్డలే తలుపులు...వాటిని కిందిదాకా లాగి, కింది అంచులమీద బండరాళ్ళు పెడితే తలుపులకు తాళం వేసి నట్లు లెక్క. ఆ మధ్యనో కొన్ని పక్కా క్వార్టర్స్ కడుతున్నా రప్పటికి...

సూర్యం నెమ్మదిగా తన గుడారం వైపు నడవసాగాడు. అతడు కర్నూలు వచ్చిన వేళావిశేషం ఎలాటిదోగాని వారం తిర క్కుండానే టెలిఫోన్ ఆపరేటర్‌గా పని చేస్తున్న జగన్నాథంతో స్నేహం కలిసింది. జగన్నాథం అతడిని ప్రభుత్వం వారు తనకు కేటాయించిన 'టెంట్' లోకి వచ్చి వుండమన్నాడు. సూర్యం తన పెట్టెనూ, పడక చుట్టనూ తీసుకొచ్చేశాడు. మూడు రూపాయలు పెట్టి ఒక వెదురు తడిక మంచం కొన్నాడు. అదే అతడికి ఏకైక ఫర్నిచర్ వస్తువయింది.

గుడారం తలుపుగా వున్న గుడ్డను పైకెత్తివేసి లోపలికి అడుగు పెట్టాడు.

స్నానం ముగించి బట్టలు మార్చుకున్నాడు. జగన్నాథం అవాళ రాత్రి పదింటికి గాని రాడు. అలా నెమ్మదిగా తుంగభద్ర నది దాకా నడుచుకుంటూ వెళ్ళి వచ్చాడు. 'ఏ' క్యాంప్ కేంటీన్‌లో భోజనం ముగించాడు.

ఇదే విధంగా రోజులు దొర్లిపోగా, పోగా రెండేళ్ళు గడి చాయి. హైదరాబాద్ రాజధానిగా విశాలాంధ్ర ఏర్పడింది. యుగ యుగాల ఆంధ్రుల స్వప్నాలు నిజం కాగా సువిశాలమైన ఆంధ్ర ప్రదేశ్ అవతరించింది. 1958 సంవత్సరం నవంబర్ ఒకటవ తారీఖున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కర్నూలు నుండి వెళ్ళి హైదరా బాద్ నగరం నుండి పనిచేయ నారంభించింది.

క్రమంగా కర్నూలు మాజీ రాజధాని అయింది. మంత్రులు ప్రభుత్వాధికారులు, ఉద్యోగులు హైదరాబాద్ తరలి వెళ్లారు. కాని ఏ, బి, సి, కేంప్‌లలో డేరాలు అలాగే వున్నాయి. వాటి నిండా కాపురస్తులూ వున్నారు.

జగన్నాథం చిన్న టెంట్ నుండి క్వార్టర్స్‌లోకి మారాడు; పెళ్ళిచేసుకున్నాడు; ఇంకెవరికో కేటాయించిన టెంట్‌లోకి సూర్యం చేరాడు.

ఒక ఆదివారం నాడు మధ్యాహ్నం 12 గంటల ఆటకు ఒక క్రొత్త సినిమా వస్తే వెళ్ళాడు—అతడు తిరిగి వచ్చేసరికి మూడు అయింది.

ఉన్నట్లుండి ఆకాశం ముసురుకొచ్చింది. విపరీతమైన వేగంలో గాలి వీచనారంభించింది. హఠాత్తుగా, ఏనుగు తొండాలతో కుమ్మరించినట్లు వర్షం కురవసాగింది.

గాలి, వాన, కలిసి విలయతాండవం చేసిన ఆ వేగానికి చాలా టెంట్లు కూలిపోసాగాయి. టెంట్స్ వెనకాల వున్న వంటగదు లన బడే షెడ్ల తాలూకు రేకులు—రెక్కలు వచ్చినట్లు ఎగిరిపో సాగాయి.

టెంట్ లోపల వుంటే ఏది విరిగి నెత్తిన కూలుతుందో నన్న ప్రాణభయంతో అందరూ బయటికొచ్చి, కళ్ళు తెరిచి చూడ లేనంతగా కురుస్తున్న ఆ వర్షంలో తప్ప తడుస్తూ నిల్చునివున్నారు. పిల్లలు ఏడుస్తున్నారు.

అరగంటయినా తగ్గని ఆ వర్షానికి డేరాలలోని పెట్టెలు నీళ్ళమీద తేలుకుంటూ బయటికి రాసాగాయి. కదలాలంటే కష్టం; కదిలితే ప్రాణ భయం; కదలకుండా నిల్చుంటే సామాన్లు పోతా యేమోనన్న సంకట పరిస్థితి.

సూర్యం తన ట్రంక్‌ని ఆరుబయట పడేసి, దానిమీద పడకను పెట్టాడు. దానిమీద తడిక మంచాన్ని తెచ్చి వుంచాడు. చుట్టుప్రక్కల వాళ్ళకు చేతనయినంతగా సాయపడ్డాడు.

ఓ గంటపేపు బీభత్సంగా కురిశాక ఆ వర్షం ఇహ చాలను కుంది.

ఆ పాటికి ఆ కాలనీ అంతా అల్లకల్లోలమైంది. గాలిలో ఎగిరి వచ్చిన రేకులు తగిలి ముగ్గురికి తలలు పగిలాయి. వాళ్ళం దరినీ ఆస్పత్రిలో చేర్చారు. తడిసిన పుస్తకాలు, కొట్టుకుపోయిన పాత్రలు, ఎగిరిపోయిన గుడ్డలు, అన్నిటికన్నా మిన్నగా హఠాత్తుగా అనాధలుగా ఆరుబయట నిలవవలసి వచ్చిన బాధ—కలిపి కళకళ లాడే ఆ కాలనీని స్మశాన వాటికగా మార్చాయి.

మరి అప్పటికి గాని కలెక్టరు వారికి తెలివి రాలేదు. అంత వరకు ఖాళీగా వున్నా ఎవరికీ కేటాయించకుండా తాళాలు వేసి వుంచిన క్వార్టర్సును అప్పటికప్పుడు కుటుంబాల వారందరికీ కేటా యించారు. మరి కొందరికి హంద్రి నది ఒడ్డున వుండే పాత ఎం. ఎల్. ఏల వసతి గృహాన్ని కేటాయించారు.

ఆ రాత్రికి అందరూ కొత్త నివాసాలలోకి సర్దుకుంటూండగా— ఆఖరికి తన పెట్టెతో తడిసిన పడకతో ఆకాశం కింద ఒంటరిగా మిగిలాడు సూర్యం.

అతడికి అతడి పేరిట టెంట్ లేనందున వేరే వసతి ఏదీ కేటాయించలేదు.

ఎక్కడికి వెళ్ళాలి అనుకున్న సూర్యానికి ఏమీ తోచలేదు. జగన్నాథం దంపతులది కొత్త కాపురం; తాను వారి మధ్య 'పుడకలా ఎందుకు వెళ్ళడం—' అన్పించింది.

దగ్గరలో వున్న క్వార్టర్సులోకి వెళ్ళాడు. అది కలెక్ట రాఫీసులో గుమాస్తా ఒకాయనకు కేటాయించారు. వాళ్ళు సామాన్లను చేరవేసి, వంట ప్రయత్నంలో వున్నారు. ఆ గుమాస్తా గారు సూర్యాన్ని గుర్తుపట్టి—"అయ్యో! మీరా! రండి రండి!" అన్నాడు.

"నాకు క్వార్టర్ లేదు. రాత్రికి నా పెట్టె, పడక ఈ వరం డాలో వుంచండి—పొద్దున్నే ఎక్కడన్నా గది చూసుకుని తీసుకుని వెళ్ళిపోతాను." అన్నాడు సూర్యం.

"అయ్యో! అదేంటండీ—ఈ పూటకేమిటి—మీకు గది దొరికే దాకా మా ఇంట్లో వుండండి—" అన్నాడు నల్గురు పిల్లలు గల ఆ కుటుంబపు పెద్ద.

"వద్దండీ! థాంక్స్....ఒక్క రోజు చాలు!"

"ఎలాగో తంటాలు పడి-అన్నం వుడికిస్తున్నాము. ఈ పూట ఇక్కడే ఎంగిలి పడండి—"

"మీ మంచితనానికి నేనేమీ చేయలేను. నేను వెళ్ళి హోటల్‌లో భోంచేస్తాను. సెలవిప్పించండి—" అని బట్టలు మార్చుకుని బయటికి వచ్చాడు సూర్యం.

ఎనిమిదవుతుంది. దాని ధర్మమా అని విద్యుత్ సరఫరా ఆగిపోలేదు గనుక దీపాలు వెలుగుతున్నాయి.

నెమ్మదిగా 'ఏ' క్యాంప్ కేంటీన్‌లోకి వెళ్ళాడు.

రెండేళ్ళనుండి తాను భోజనం చేస్తున్నది అక్కడే...

ఆవాళ వర్షంలో తన నెలసరి హోటల్ భోజనం టిక్కెట్ల పుస్తకం కొట్టుకు పోయింది.

ఆ మాట చెబితే కేంటీన్ ఓనర్ తలవూచాడు కాని టికెట్ లేనిదే భోజనం పెట్టనన్నాడు.

"మీకు నన్ను రెండేళ్ళనుంచి తెలుసుగదా— ఇవాళ గొడవంతా కూడా తెలుసుకదా— నేను మూడురోజుల క్రింద అరవై రూపాయలు పెట్టి భోజనం టిక్కెట్ల పుస్తకం మీ దగ్గర తీసుకున్నాను కదా?" అని ప్రశ్నించాడు సూర్యం.

"అవన్నీ సరేనండి! మీరిప్పుడు భోజనం కావాలి అంటే రూపాయిన్నర పెట్టి టిక్కెట్టు కొనుక్కోవాలి—"

"ఇంత అన్యాయమా?" అని కోపంగా వాదించాడు సూర్యం.

కాని ఆ ఓనర్ చెక్కుచెదరకుండా చెప్పిన మాటేమిటంటే-"మీరు పుస్తకం కొన్నానంటున్నారు, అది వర్షంలో పోయిందంటున్నారు. అదింకెవరికో దొరికిందనుకోండి- వారొచ్చి ఆ టిక్కెట్టు ఇస్తే నేను భోజనం పెట్టాలి గదా-" అన్నాడు.

సూర్యానికి ఒళ్ళు మండిపోయింది. న్యాయం తన పక్కన వుంది; నిజం తన పక్కన వుంది. అయినా తాను ఓడిపోతున్నాడు. అవతలివాడు మోసగాడు, అరవై రూపాయలకు నెలపొడుగునా భోజనం పెడతానని పుస్తకం ఇచ్చినవాడు, ఇట్లాంటి విపరీత పరిస్థితిని ఆధారంగా చేసుకుని ఇరవై ఏడు రోజుల భోజనాన్ని

ఎగ్గొడదామని చూస్తున్నాడు। అయినా అతగాడి వాదన వినడానికి చాల సబబుగా వుందనిపించింది.

ఎక్కడుందా తికమక?

మనిషి మాటకన్నా కాగితం ముక్కమీద నమ్మకం ఎక్కువయిన కాలంలోనా?

సందు దొరికితే చాలు ఎదుటివాడిని దోచుకుందామనే మన సత్వంలోనా?

అన్యాయం చేస్తూ మాటల గారడీలో దానికి మసి పూసి మారేడు కాయచేసే యుక్తిలోనా?

ఒళ్ళు మండిపోతుండగా సూర్యం బయటికి వచ్చాడు.

శతాబ్దాల తరబడి ఇంగ్లీషువాళ్ళు దేశాన్ని దోచుకున్నారు.

మద్రాసులో మూక వుమ్మడిగా ఆంధ్రులకు పంగనామాలు పెట్టారు.

నేడీ హోటల్‌వాడు తన్ను మోసగించాడు.

ఎందుకిలా? ఎందుకిలా? ఏమిచేయాలి? కుతకుత వుడికిపోతూ నడిచిపోతున్న సూర్యాన్ని జనరల్ ఆస్పత్రి గేటుదగ్గర జగన్నాథం ఆపాడు.

"సూర్యం! ఎక్కడికిలా?"

సూర్యం చెప్పాడు.

"ఈ వర్షంలో నువ్వేమయ్యావో—ఎలా వుంటావో అని వెతుక్కుంటూ వచ్చాను. నీ దేరా కుప్పగా కూలివుంది. నీకేమయినా అయిందేమోనని భయపడ్డాను. వాకబు చేస్తే నీకేమి దెబ్బ తగల్లేదని తెలిసింది. మేము వుదయమే టౌన్లో మా బంధువులింటికి వెళ్ళాము. గంటకింద కాలనీలోకి వచ్చాము. పోదాం పద, మా ఇంటికి— అన్నట్లు నీ పెట్టె, పడక ఎక్కడ?"

అన్నీ చెప్పాడు సూర్యం. చివర అతడు హోటల్‌వాడు చేసిన అన్యాయం గురించి కోపంగా చెబుతుంటే విని జగన్నాథం నవ్వాడు.

ఇల్లు చేరారు.

చల్లటి ఆ రాత్రివేళ వెచ్చని భోజనం వడ్డించింది జగ

న్నాథం భార్య కమల.

హాయిగా కడుపునిండా తిన్నాడు సూర్యం. ఈ రెండేళ్ళ నుండీ హోటల్ తిండే శరణ్యం. ఆ విధంగా జవ చచ్చిన జిహ్వకు మిత్రుడి భార్య చేసిన కంది పచ్చడి, దొండకాయ వేపుడు, చారూ ప్రాణం పోశాయి.

"ఇంకా స్త వేసుకోండి!....అయ్యో! అంత తక్కువ వేసు కుంటారే—" అని ఆవిడ కొసరి కొసరి వడ్డిస్తుంటే — అమ్మ గుర్తు కొచ్చిన కళ్ళ వసకలు కమ్మాయి.

భోజనాలయాక చాలసేపు మిత్రులిద్దరు కబుర్లు చెప్పుకున్నారు. పదకొండయింది. జగన్నాధం లోపలే పడుకోమని ఎంతగానో చెప్పినా వినకుండా, వరండాలో చాప దిండూ వేసుకుని పడుకు న్నాడు సూర్యం.

మరచెంబుతో నీళ్ళు, గ్లాసు పుంచి వెళ్ళింది కమల.

కాసేపటికి తలుపులు మూతబడ్డాయి. తలుపులు మూతబడ గానే సూర్యానికి కునుకుపట్టింది.

ఎప్పుడో మరి— హఠాత్తుగా మెలకువ వచ్చింది.

కిలకిలమని నవ్వు: గలగలమని గాజులు.

సూర్యం చాల ఇబ్బందిగా ఫీలయ్యాడు. లేచి వీధిలోకి వెళ్లి తిరిగి వచ్చాడు.

ఎక్కడో మొరుగుతున్న కుక్కలు తప్ప, ఆ సాయంత్రం భయంకరమైన వానదెబ్బకు గాయపడిన ఆ కాలనీ అంతా ప్రశాం తంగా నిద్రపోతోంది. వరండలోకి వచ్చాడు. మరచెంబులోంచి గ్లాసులోకి నీళ్ళు వంచుకుని తాగాడు. పడుకున్నాడు. నిద్రపట్టింది. తెల్లవారు జామున కలలో అతడి తల నెవరో దువ్వుతున్నారు. ఇంకొక చేత్తో పెరుగన్నం ముద్దలు నందిస్తున్నారు.

ఆ గాజుల చెయ్యి ఎవరిది? ఆ చల్లదనపు ఒడి ఎవరిది? మొహం కనపడలేదు కలలో — మేలుకున్నాకా అంతే:

o o o o

మరొక వారం తిరక్కుండా సూర్యానికి ఊళ్ళో వన్-టౌన్ పోలీసు స్టేషన్‌దగ్గరగా ఒక సందులో యిల్లు దొరికింది.

ఇంటి యజమాని వరసయ్యకు నూనెల వ్యాపారం. నల్లగా చింతమొద్దులా వుంటాడు. నూనెలు, డబ్బు తప్ప మరొక లోకం లేదు. కాని నెమ్మది మనిషి. చదువుకున్నవారంటే భయ భక్తులతో మాట్లాడే కాలంనాటి వ్యక్తి అతడి ఏయసు నలభైకి పైగా వుంటుంది. అతడి భార్య రత్నంకు ముప్పైయేదు లోపే వున్నట్టనిపిస్తుంది. మనిషి నలుపే కాని నిండైన విగ్రహం: తరచిచూచే కళ్లు: చెవులకు రవ్వల దుద్దులు, చేతిలో డజన్ బంగారు గాజులు. మెళ్లో ఐదారు రకాల గొలుసులతో ఆవిడ నడుస్తుంటే బంగారపు కొణం నడిచివ స్తున్నట్లుంటుంది. దంపతులిద్దరికీ పూజా పునస్కారాల మీద మక్కువ ఎక్కువ.

సూర్యానికి మేడమీద గది అద్దెకిచ్చారు. గది ఎదుట డాబా. డాబా అటువైపున్న గదిని ఇల్లుగలవాళ్లే వుంచుకున్నారు. బాత్ రూం కూడా పైనే వుంది. రోజూ పొద్దున లేవగానే పనిమనిషి సూర్యం గది చిమ్మి మంచినీళ్ళుపెట్టి, బాత్‌రూంలో రెండు బకెట్లునీళ్లుంచేది. సూర్యానికి చాల హాయిగావుంది. నలభై రూపాయలఅద్దెకు కిర్నాలు లాటి వూళ్ళో ఈమాత్రం సౌకర్యంగా వున్న గది దొరకడం తన అదృష్టమే ననుకున్నాడు,

ఎటొచ్చీ ఆ ప్రెస్‌లో పనే తనకేమీ నచ్చడంలేదు. ఆ మెషిన్లు, ఆ వర్కర్లు, రాత్రింబగళ్ళు పనిచేయడాలు- తనకి పడడం లేదు. "కర్మకాలి ఈ ప్రింటింగ్‌టెక్నాలజీ చదివానుగాని, వీలయితే వృత్తి మార్చాలి" అని అనిపిస్తుండేది అప్పుడప్పుడూ.

భోజనం మెయిన్ రోడ్‌మీద వున్న ఒక హోటల్లో చేసేవాడు. ఆ కారం పడక అప్పుడప్పుడు అనారోగ్యం పాలయేవాడు.

అయిదారు నెలలు గడిచాక ఒకసారి రాత్రి పడుకున్నవాడు పొద్దున లేద్దామనుకుంటే లేవలేకపోయాడు. కళ్ళు మండుతున్నాయి.

పనిమనిషి వచ్చి తన పని తాను చేసుకుపి వెళ్ళిపోతుంటే- "ఎల్లమ్మా! ఆ ఫ్లాస్క్ తీసుకువెళ్లి నాకో కప్పు కాఫీ తెచ్చి పెట్టు" అన్నాడు.

కాఫీ వచ్చింది. తాగి పడుకున్నాడు.

"ఏమండీ! ఒంట్లో బాగులేదా?"

కన్ను తెరిచి చూశాడు. జరీ అంచు తెల్ల చీరలో రత్నం. నవ్వుతూ కన్పించింది. లేచి కూచోబోయాడు.

"వద్దు వద్దు! మీరలాగే వుండండి....అయినా ఏమిటి మీకు, ఇంట్లో మేమంతా మనుషులమనుకున్నారా, మాకు కులమనుకున్నారా? ఆ ఎల్లమ్మ చెప్పేదాకి నాకు తెలియనే తెలియదు— ఆయనేమో ఏడింటికల్లా దుకాణానికి వెళ్ళిపోయారు— లేకపోతే ఆయనే డాక్టరును తీసుకొచ్చి వుండేవారు.... మీరేమన్నా మందు వేసుకున్నారా—" అని వరసగా ప్రశ్న లడిగింది.

"అబ్బే ఏమీ లేదండీ— మామూలు జ్వరం.... ఒకరోజు విశ్రాంతిగా వుంటే అదే పోతుంది—" అన్నాడు నీరసంగా.

దగ్గరకొచ్చి అతని నుదుటిమీద చేతినుంచి చూసింది ఆవిడ. మెత్తగా చల్లగా వుంది ఆమె హస్తం.

"జ్వరం లేదంటారేమిటి— బాగానే వుంది. ఏవన్నా మాత్ర తెప్పిస్తాను. వేసుకోండి. జావ కాస్తాను, తాగండి" అంది ఆమె అధికారంతో

ఉక్కిరి బిక్కిరయ్యాడు సూర్యం.

రెండో రోజుకెల్లా లేచి తిరగసాగాడు.

అది మొదలుగా రత్నం అడపా దడపా అతడి గదిలోకి వచ్చేది. ఏవో సినిమా కబుర్లు అవీ మాట్లాడేది. మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్య ఫక్కున నవ్వేది. తల వంచి ఓరగా చూసేది.

ఒక ఆదివారం మధ్యాహ్నం అతడు నిద్రపోయి లేచి పడక సర్దుతుంటే, తలగడా కింద ఒక 'శృంగార' మాసపత్రిక కనపడింది!

అతడాశ్చర్యపడ్డాడు.

ఆ సాయంకాలం అతడు మెట్లుదిగి వీధిలోకి వెళ్ళిపోతుంటే— "సినిమాకా?" అని విన్పించింది.

తిరిగి చూశాడు

రత్నం! ఆమె కళ్ళు!

మాట్లాడకుండా వీధిలో పడ్డాడు.

అతడి మనసు సుడులు తిరుగుతూంది.

సినిమాకు అనుకోలేదు కాని ఇంకేమీ తోచక సినిమాకే

వెళ్ళాడు.

సినిమా అయ్యాక నడిచి నడిచి సాయిబాబా గుడికి వెళ్ళాడు.

ఆ గుడికి అవతలివైపు మెట్ల మీద కూర్చున్నాడు. తుంగ భద్రా నది పాయలు పాయిలై పారుతూంది. ఎడమవైపున బ్రిడ్జి మీంచి రైలొకటి హోరుమంటూ వెళ్ళింది. అంత చీకటిలోనూ ఎవరో 'అరిగె' మీదుగా నదిని దాటుతున్నారు.

మెట్లు దిగి నీళ్ళను అబగా మొహం మీద చల్లుకున్నాడు. కొంత వేడి తగ్గినట్లయింది. చల్లటిగాలి వీచేసరికి అమ్మ చేయి తగిలినట్లయింది. ఆకలివేళ అన్నం పెట్టిన మిత్రుడి భార్య కమల చేయి గుర్తుకొచ్చింది. మొన్న మొన్న తను జ్వరంలో ఉడికి పోతుంటే చల్లగా సేవదీర్చిన చేయి అమ్మ చేయి కాదూ!

విదానంగా ఇంటివైపు నడిచాడు.

మెట్లెక్కాడు. గది తలుపులు తీశాడు.

మాసపత్రికను చింపి తగలపెట్టాడు.

పడకమీద పడుకున్నాడు.

కాసేపటికి నిద్రపట్టింది.

పొద్దునవగానే గది ఖాళీ చేశాడు.

ఇవ్వవలసిన అద్దె నొక కవరులో వుంచి, నరసయ్య పేరు రాసి మెట్లు దిగి వాళ్ళ వాటాలో పడేశాడు.

పెట్టె, పడక పట్టుకుని తిన్నగా ఒక హోటల్‌లోకి వెళ్లాడు; గది తీసుకున్నాడు.

జగన్నాథం ఇంటికి సాయంకాలం వెళ్లాడు.

"రండి! ఆయన వసుంది నెల్లూరెళ్లారు. రండి! కూర్చోండి:" అంది కమల.

"వస్తానండి! మళ్ళీ వస్తాను."

"కాఫీ తాగి వెడుదురు గాని రండి—"

"వద్దండీ! ఇప్పుడే కాఫీ త్రాగి వచ్చాను-వస్తాను."

సూర్యం నెమ్మదిగా నడుచుకుంటూ పార్కుకి వెళ్లాడు. అక్కడి పచ్చదనం చల్లగా వుంది. ఎత్తయిన చెట్లు, విశాలంగా పరచుకుని వున్న చెట్లు-మనుషులు ఎంత పొట్టివారో, ఎంత వంకు

చిత స్వభావులో ఎత్తి చూపుతున్నట్లున్నాయి.

గడిమీద వెల్లకిల పడుకున్నాడు.

-ఏమిటీ జీవితం! ఎక్కడి మదరాసు, ఎక్కడి కర్నూలు- ఆంధ్ర రాష్ట్రానికోసం శ్రీరాములు ఆత్మార్పణ చేస్తే నాన్న కూడా అందుకే ప్రాణం కోల్పోయాడు. చిన్నప్పటి నుండే తల్లి లేదు. అహోరాత్రులు ఆ ప్రెస్‌లో పని చేసి చేసి ఆయన కన్ను మూశాడు. మళ్ళీ తనకు ఆ ప్రెస్‌లోనే వుద్యోగం-అసలు తనీ చదువెందుకు చదివాడు? చదివినా ఈ వూరెందుకు రావాల్సి వచ్చింది? వర్షంలో ఆ నాడు గుడారం కూలకపోతే నిన్న రాత్రి అలా గడిచి వుండేదా? "కష్టపడి పనిచేయి! నీతిగా బతుకు! భగవంతుడిని నమ్ము!-ఇవీ నాన్న పదేపదే తనకు చెబుతూండిన మాటలు.

కష్టపడి పనిచేయడంలోని ఆనందం తనకు తెలుసు. తనకు నచ్చకపోయినా తన వుద్యోగం తెచ్చే ఆదాయం తనకు సరిపోగా నెలకో నలభై యో, యాభయ్యో మిగులుతుంది.

ఇహ నీతిగా బతకడం-తనకు బతకాలనే వుంది కాని బతక నిచ్చేటట్లు లేదు. ఆ హోటల్‌వాడు. రత్నం-వీళ్ళంతా నీతిగానే బతుకుతున్నారా?

'దేవుడిని నమ్ము'-ఏమో....తనకు నమ్మాలని లేదు; అలా గని అగౌరవించాలనీ లేదు. అట్లా కనబడని ఒక శక్తిని రాతిలో, పటంలో, చూసుకుని దండాలు పెట్టాల్సిన అవసరం తనకు రాలేదింతవరకూ-ముందు ముందు వస్తుందా....ఏమో....చూద్దాం....

అయితే నిన్న సాయిబాబా ఆలయంలో ఆ ప్రశాంతి ఎక్కడిది?

అబ్బే- అది ఆలయానిది కాదు; అది తుంగభద్ర నదిది; చల్లని గాలిది. అంతే! సాయిబాబా అంటే హిందువులను ముస్లిములనూ తమ తమ మత సంకుచితత్వాన్ని వదిలేటట్లు చేయగలిగాడని తనకు అపారమైన గౌరవం వుంది. అంతమాత్రాన ఆయన దేవుడని దండకాలు పల్లించి, దండాలు పెట్టి, పూజలు చేసి కొబ్బరి కాయలు కొట్టడం— తన్ను తాను మోసగించుకోవడం అవుతుంది.

వాచీ చూసుకున్నాడు; ఆరున్నరవబోతూంది. పార్కులో జనం ఎక్కువవుతున్నారు.

లేచాడు సూర్యం.

కాళ్ళు అతడిని సాయిబాబా ఆలయం దగ్గరకు లాక్కెళ్ళాయి.

చెప్పులు బయట విడిచాడు. లోపలికి నడిచాడు

అశ్వత్థ వృక్షం చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు కొందరు.

మందిరం చుట్టూ తిరుగుతున్నారు ఆడా మగా....

పిల్లలు పరుగెడుతూ ఆడుకుంటున్నారు. 'అరటి పండు కావాలీ!' అని ఏడుస్తూంది ఒక పిల్ల.

భిక్షగాళ్ళు పైసకో ఆశీర్వాదం చొప్పున పంచుతూ నిల్చున్నారు.

ఉండుండి గంట మోగుతోంది.

తనకు తెలియకుండా మెట్లెక్కి మందిరం వైపు వెళ్ళాడు. లోపల సాయిబాబా విగ్రహానికి పూజచేస్తున్నాడు పూజారి,

రాతితో చేసినదే అయినా ఆ కళ్ళల్లోకి అంతటి ఆర్ద్రత ఎలా వచ్చింది? ఎంత గొప్ప శిల్పిఅయి వుండాలి, ఈ విగ్రహం మలిచినవాడు?

ఆ కళ్ళు తన్నే చూస్తున్నాయి. "హలో సూర్యం! నువ్వ టోయ్?" అని పలకరిస్తున్నట్లున్నాయి.

ఒక నిముషం కళ్ళు మూసుకున్నాడు సూర్యం.

కళ్ళు తెరవగానే కన్పించాయి అడిగో, ఆ కళ్ళు!

ఎంత ప్రశాంతమయిన కళ్ళు అవి!

అవి తన్నే చూస్తున్నాయి.

తాను చూచినక్షణం అవి సాయిబాబా వైపు తిరిగాయి.

గబగబ మెట్లు దిగి వెళ్ళిపోయాడు.

మళ్ళీ తుంగభద్ర వైపున్న మెట్లమీద కూర్చున్నాడు.

ఇసుక ప్రియుడయితే అతడి తలలోకి తనవేళ్ళను జొపి ప్రేమతో దువ్వుతున్న ప్రేయసిలా పారుతుంది తుంగభద్ర!

"క్షమించండి! ఈ రుమాలు మీరక్కడ వదిలేసి నట్లున్నారు-"

తుంగభద్రకు గొంతొస్తే మాటలు ఇలాగే వుండునేమో అను
న్నా డతడు. ఒక నిముషం తర్వాత చటుక్కున గుర్తుకొచ్చినట్లు-
థాంక్స్" అన్నాడు సూర్యం
ఆమె నవ్వింది.
పారుతున్న నదినీళ్ళ గలగల అది.
సూర్యం ఆశ్చర్యం ఇనుమడించింది: కుతూహలమయింది.
ఆమె కూడా మెట్లమీద కూర్చుంది,
ఎవరో దంపతులు రెండేళ్ళపాపను చెరోపక్క పట్టుకుని వాళ్ళ
క్షేమంగా తీసుకువెళ్ళారు.
ఆ పాప ఆమెను చూచి నవ్వింది.
అదిచూచి సూర్యానికెందుకో హాయి అనిపించింది.
"ప్రసాదం తీసుకుంటారా?" ఆమె కొబ్బరిచిప్ప అందిం
ంది
"చిప్పంతా ప్రసాదమేనా?"
నవ్వింది "దానిని సరిగా ముక్కలు చేయడం నాకు రాదండి"
చిప్పలో ఒక వైపున్న కుంకుమ తీసి బొట్టు పెట్టుకుంటూ
మోనని చూచిందామె. అతడా పని చేయలేదు.
ఒడుపుగా ముక్క కొట్టి, దానినుండి పెంకు తొలగించి
మెకు ఇచ్చాడు. కళ్ళకద్దుకొని నోట్లో వేసుకుంది.
తానొక ముక్క తీసుకుని మిగతాదంతా ఆమె కిచ్చాడు.
వుంచండి: ఇంటికి తీసుకెళ్ళి పచ్చడి చేసుకోవచ్చు-"
మళ్ళీ నవ్వింది ఆమె. "మీరే తీసుకు వెళ్ళి ఇంట్లో ఇవ్వండి..."
అతడు గల గల మని నవ్వాడు. నవ్వడంలో నొసటి మీద
చేన ముంగురులను పెసక్కి తీసుకున్నాడు. ఆ కదలికలన్ని గమ
నించింది ఆమె.
"ఏం అలా నవ్వారూ?" అని అడిగింది.
"ఎందుకంటే, కొబ్బరి తీసుకు వెళ్తే పచ్చడిచేసి పెట్టేవాళ్ళు
దుకదా తినేవాళ్ళు కూడా లేరు మా ఇంట్లో- అంతే కాదు-
చాలనగా నాకు ఇల్లు కూడా లేదు-" అన్నాడు సూర్యం.
"అంటే మీదీ వూరు కాదా?"

"ఈ వూరే కాని ఇవాళే అత్యవసరంగా గది ఖా
చేయాల్సి వచ్చింది. ఇంకో కొత్త రూం దొరకేదాక హోటల్‌లో
వుండక తప్పదు."

"అంటే మీ అమ్మ నాన్న ఇక్కడ లేరా?"

"ఎక్కడా లేరు_" అన్నాడు సూర్యం.

అది వినగానే ఒక నిముషం ఆమె కళ్ళు మూసుకోవడ
అతడికి ఆశ్చర్యం వేసింది.

మూసిన ఆ కనులు ఎంతందంగా వున్నాయి.

తెరిచిన ఆ కనుల అంచున ఒక ముత్యం మెరవడం,
ముత్యంలో గట్టుమీది దీపం వెలగడం, అతడివేపి గమనించ కూ
దని ఆమె మొహం అటుతిప్పి, కంట్లో నలుసుపడ్డట్లుగా చీ
కొంగుతో తుడుచుకోవడం_ అన్నీ సనిరంగా గమనించాడు అతడు

మౌనంగా వున్నాడు సూర్యం.

అలాగే పదినిముషాలు గడిచాయి.

గలగలమని మాట్లాడుకుంటూ జనం వస్తూ వెళుతు
వున్నారు.

"వెలవు, వస్తాను" అంటూ లేచింది. పమిటకొంగుమ భుజ
చుట్టూ నిండుగా కప్పుకుంది. అతడివైపు చూచింది. వరదగూ
మధ్య చందమామలా వుంది ఆమె వదనం.

సూర్యానికి ఏదో కొత్త లోకంలోకి అడుగుపెడుతున్నట్లని
పించింది.

"చీకటయింది కదా.... మీ కభ్యంతరం లేకపోతే నేన
మిమ్మల్ని ఇంటిదాక వదిలి వస్తాను." అన్నాడు సూర్యం నెమ్మదిగా

ఏమి లాలన ఆ గొంతులో!

పొడిగా నవ్వింది ఆమె. "నాకూ ఇల్లు లేదు!"

ఒక్కొక్కమాట ఒక్కొక్క తరంగమై మోదింది అతడిని

"అయితే_ అయితే_" అని తడబడుతున్న అతడికి ఆమె
సమాధానం చెప్పింది_ "నాకూ అమ్మా నాన్న లేరు!!!"

ఇందాక మెరిసిన కంటిచివరి ముత్యానికి కారణం ఇదా.... _

"ఎంత చిత్రం!" అనగలిగాడు.

"ఔను. చిత్రమే-"

"ఇద్దరు అనాధలు ఇట్లా కలవడం చిత్రమే!"

"నేను అనాధను కాను.... నేను నమ్మే దేవే నాకు అమ్మా నాన్న!" అంది ఆమె.

నెమ్మదిగా నడుస్తున్నారు.

"అయితే మీకేమీ ఫరవాలేదు...."

"ఏం, మీరు దేవుడిని నమ్మరా?" అని అడిగింది ఆమె.

బయటికి వచ్చారు. ఆమె చెప్పులు తొడుక్కుంటున్నప్పుడు సన్నటి ఆమె పాదాలను చూశాడతను. మరుక్షణం ఆమె చీరకుచ్చిళ్ళు అడ్డం వచ్చాయి.

"మీరు నా ప్రశ్నకు జవాబు చెప్పలేదు" అని అడిగిందామె.

"ఏం చెప్పను? ఏమీ చెప్పలేను."

"బలే తమాషాగా చెప్పారు. మరి అనాధ అన్న భావం ఎందుకు కలగాలి మీకు?"

"అబ్బే! నేను ఆ విధంగా అనలేదు. అనాధంటే తల్లీతండ్రీ లేనివాడని కాదు. ఇల్లులేని వాడని కాదు-"

"మరి?"

"తల్లీ, దండ్రీ, ఇల్లు, తోడబుట్టిన వారుండి కూడా అనాధలుగా వున్న వాళ్ళున్నారు."

"అంటే?"

"అంటే సానుభూతి, ఆప్యాయత, స్నేహం- కరవయిన వాళ్ళన్న మాట-" అన్నాడు సూర్యం. ఈ సారి ఆమె తన వైపు చూసినప్పుడు ఆమె కళ్ళల్లో తన్ను తాను చూసుకున్నాడు.

"నాకొక రిక్షా మాట్లాడి పెట్టండి! ఆనంద్ టాకీస్ దగ్గర వనితా మందిరి హాస్టల్ దగ్గరకు."

"మీరక్కడ వుంటున్నారా?"

తల వూచింది ఆమె-

రిక్షా కదిరింది....

"వస్తాను. నమస్కారం." రిక్షా గూడు క్రింది చీకటిలోకి

వెళ్ళింది ఆమె మొహం_

రిక్షా కదలబోయింది_

"ఏమండీ! మీ పేరూ_?" అని అడిగాడు సూర్యం.

"దుర్గ!"

రిక్షా కదిలింది.

సూర్యం గాలిలో తేలుతున్నట్లుగా నడిచి హోటల్ కు చేరాడు.

ఈ భూమ్మీద రాక్షసులే గాక దేవతలూ వుంటారు, మాట_అనుకున్నాడు!

o o o

మూడు రోజుల తర్వాత సూర్యానికి నరసింహారావ్ పేటలో ఒక గది దొరికింది. భోజనం హోటల్‌కు కాస్త దూరం అయినా ప్రెస్సుకు దగ్గర కావడంతో తీసుకున్నాడు

సాయంకాలం వెళ్ళి జగన్నాధానికి కనబడాలి అనుకుంటూ డగానే జగన్నాధం ఫోన్ వచ్చింది_

"ఏమోయ్ సూర్యం! నాల్గురోజుల క్రింద నువ్వు నాకోసం ఇంటికొచ్చావట. ఒక్క-క్షణంకూడా కూర్చోకుండా పరుగెత్తిపోయా వుట_"

ఆరోజు ఆ క్షణంలో తన మనసుస్థితిని గుర్తుకు తెచ్చు కున్నాడు సూర్యం!

జగన్నాధం మాట్లాడుతూనే వున్నాడు-

"మరేమో నువ్వెందుకొచ్చావో ఏమిటో చెప్పనన్నా చెప కుండా వెళ్ళి పోయావుట. నేను నెల్లూరు వెళ్ళి నిన్న ఉదయ వచ్చాను.. కమల నీమాట చెప్పగానే మీ ఇంటికి సైకిల్ తీసు వెళ్ళాను_"

సూర్యంగుండె వేగంగా కొట్టుకుంది

"నువ్వేమో హఠాత్తుగా ఖాళీచేసి వెళ్ళిపోయావనిచెప్పారు.."

"ఎవరు_"

"నరసయ్య!" ఆయన_నేనూరినుండి వచ్చేదాకనన్నా వుండ కుండా నిముషాల మీద ఖాళీ చేసి వెళ్ళి పోయారుట. ఇంట్లో అ

ళ్ళకు కూడా కారణం ఏమీ చెప్పలేదు, పదిరోజుల అద్దమాత్రం వర్‌లో వుంచి వెళ్ళిపోయారు–" అని చెప్పాడు నరసయ్య. ఎక్క కి వెళ్ళారోతెలీదన్నాడు...ఏమిటీ మిస్టరీ అంతా సూర్యం–?" అని అడిగాడు జగన్నాధం.

"అబ్బే ఏమీ లేదు" చాలా రోజులనుండి అక్కడ అసం ఫులో దోమలు ఎక్కువగా వున్నాయి కదా అని మంచిగది కోసం తుకుతున్నాను. మంచిగది దొరకగానే. అది ఖాళీచేసి వెంటనే మారి యాను. అంతే!"

"ఇంతకూ నువ్వొచ్చింది ఏదన్నా..."

"అబ్బే ఏమీలేదోయ్– మీ ఇంటికి వూరికే వచ్చానంతే!" అన్నాడు సూర్యం

"సరే! అయితే విను..ఇంట్లోనే వుండివుండి బోర్ కొడు తోందని కమల గోలపెడుతోంది...అంచేత ఎల్లుండి ఆదివారం నాడు సంకేశుల ప్రోగ్రాం పెట్టాము. ఏం, నువ్వొరా!" అని చెప్పాడు జగన్నాధం.

"నేనా? మీ రిద్దరూ సరదాగా వెళ్తూంటే మధ్య నేనెందుకు?"

"సంతోషించాంలే సీతెలివి తేటలకు. నోర్మూసుకునిరా !!. ఆదివారం ఉదయం 9–6 0 బస్సులో బయలు దేరతాము. మేము ఇంటి నుండి తిన్నగా వస్తాము. నువ్వు 9–30 కల్లా బస్‌స్టాండ్‌కొచ్చేయి"

"అలాగే..."

"ఆవడలూ, పులిహోరా చేస్తానంది .ఇంకేవన్నా కావాలంతే చెప్పు, చేయించి తీసుకొస్తాం..."

"నాకోసం వేరే వద్దోయ్ .నేను హోటల్ గడ్డిమేసే వాడిని దా.. ఇంటి వస్తు వేదయినా నాకు విందు భోజనంలా వుంటుంది–"

"చూస్తాంగా.. నీ ప్రతాపం ఎంతలా వుంటుందో–ఇపుడే పందెం కడుతున్నా..పది రూపాయలు..నేను డజన్ ఆవడలు లాగి స్తాను.. మరినువ్వో..."

"చూద్దాంలే!" అని నవ్వి ఫోన్ పెట్టేశాడు సూర్యం..

ఆరోజు ప్రెస్సులో ఒక ఆటోమేటిక్ మిషన్‌కు బ్రేక్ డౌన్ రావడంతో ఆ రాత్రికూడా అక్కడేవుండి ఆ పని పూర్తి చేసి తెల్ల

వారు రూమున ఇంటి కెళ్ళాడు.

తన గదిలోకి వెళ్ళి పడుకుంటుండగా ఎవరో సన్నగా ఏడు స్తున్నట్లు వినిపించింది.

చెవులు రిక్కించాడు.

మొగగొంతు నెమ్మదిగా వినిపిస్తూంది_

"ఎన్నిసార్లు చెప్పాను నీకు.. సింగారించుకుని భోగం పాపలా గుమ్మంలో నిలబడ వద్దని... మళ్ళీ ఇవాళ తయారయ్యా వేం... ఎవడయినా ఎదుటి మేడ మీద ప్రియుడున్నాడేమిటి చెప్పు. విన్నూ వాడినీ కలిపి తోలు వల్చి వేస్తాను_"

ధబీ ధబీ మని దెబ్బలు ..

"కొట్టకండి .నేను పడలేను.. నన్ను కొట్టకండి_"ఏడుపు మధ్య ఆడగొంతుక.

సూర్యం రక్తం కుతకుత ఉడికి పోయింది_

ఎవడా పశువు..ఎవడా నరరూప రాక్షసుడు !

తనను నమ్మి తనతో వున్న ఇల్లాలి మీద చేయి చేసుకునే ఆ నీచుడిని లాగి నాలుగు గుద్దులు గుద్దితే !

ఆవేశం చల్లారగానే అన్పించింది.. అమ్మో ఆ విధంగా తాను కలియ బడితే ఇంకేమన్నా వుందా.. ఆ ఇల్లాలు. పాపం ఆ తల్లి ఎవరో ఆమెకూ తనకూ సంబంధంవుందనడూ ఆ ధూర్తుడు....

ఏమి ప్రపంచం ! ఏమి మనుషులు !

తన్నేవాడు భర్త !

తన్నులు భరించేది భార్య !

ఏమి దాంపత్యం

దాంపత్య జీవనంలోని సాహచర్యం, అనురాగం, ఆత్మీయత, అప్యాయత_ఏవీ.... అవన్నీ వుత్త మాటలేనా ?

కాదు అన్పించింది. కమల, జగన్నాధం ఎంత కులాసాగా వుంటారు...

అనుకుంటూ నిద్రపోయాడు సూర్యం.

ఆ మరురోజు ఆవిడ ఎవరో చూద్దామని ప్రయత్నించాడు... కాని అతడు డ్యూటీకి బయలుదేరేదాక ఆ వాటా తలుపులు మూసే

వున్నాయి!

రెండురోజులు చక్కగా గడిచాయి.

ఆదివారం వచ్చింది

o o o

పొద్దున్నే లేచి స్నానం అదీ ముగించాడు సూర్యం. ముకికి అవుతుందేమోనని కాస్త ముదురురంగు పాంటూం తొడిగి టీ-షర్టు వేసుకున్నాడు. ఒక సంచి భుజాన వేసుకున్నాడు.

గది తాళం వేస్తుండగా అలికిడయితే అటు వైపు వాటా కేసి చూశాడు

నాలుగేళ్ళబ్బాయిని చంకలో వేసుకుని వుంది తెల్లగా, బొద్దుగా, ముఖాన పసుపు కుంకుమలతో ముచ్చటపడతతో! పాలు పోయించు కుంటూఎది.

"ఈవిడనేనా ఆ రాక్షసుడు హింసించింది. ఈమె మొహం లేశ మాత్రమయినా క్లేశం అనేది లేకుండా ప్రసన్నంగా వుందే.. ఇదెలా సాధ్యం-" అనుకుంటూ తాళం వేశాడు.

తలవంచుకుని వీధిలోకి నడిచాడు

కమల-రత్నం- అ పక్కింటిల్లాలు-

దుర్గ...

ఎంత విచిత్రం .... మనుషుల్లో ఎన్ని రకాలు .... ఎన్ని ప్రవృత్తులు.... అందరి జీవితాలూ పైకి ఒకే మూసలో పోసి నట్లు కనబడుతున్నా, లోలోపల ఎవరి జీవితాలు వారివే....ఒకరి దారికీ ఇంకొకరి దారికీ పోలికే వుండదు కాబోలు ... అదే పప్పు, ఉప్పు, చింతపండు, ధనియాలు వగైరా సామగ్రితో ఒక్కొక్కరు చేసిన వంటకం ఒక్కొక్క విధంగా వున్నట్లు—భర్త, భార్య, డబ్బు, సుఖం, నిద్ర, దుఃఖం, అన్న సామగ్రితో ఒక్కో దాంపత్యం ఒక్కో రుచిని సంతరించుకుంటుంది కాబోలు-

అయినా కలిసి జీవితయాత్ర సాగిద్దామని నిర్ణయించుకున్న భార్యాభర్తలు - తీరి కూమని ఒకరి నొకరు హింసించడం, ఒకరి నొకరు మోసగించడం ఎందుకు? నిండుగా, సంతోషంగా, సంతృప్తిగా, ఉన్నంతలో హాయిగా, నిజాయితీగా, నిటారుగా

తలెత్తి బతకడం అనేవి అంత దుష్కరమా, దుస్సాధ్యమా! ఒకరి అంతరంగం ఇంకొకరికి తెలిసి పాలూ నీరూ వలె, పువ్వూ దారం వలె, సముద్రమూ తరంగంవలె – కలిసిపోయే దాంపత్యం అంత అరుదయిన వస్తువా?

గట్టిగా సైకిల్ బెల్ మోగడంతో అదిరి పడ్డాడు సూర్యం.

"ఏం సార్! తెల్లారాక కూడ కలలు కంటూ నడిరోడ్డు మీద నడుస్తున్నారూ?" అని జోకేసి వెళ్ళిపోయాడు సైకిలు వాహనుడు.

కొండారెడ్డి బురుజు దగ్గరకు వచ్చేశాడు, అదిగో .... బస్టాండు.

వాచీ చూస్తే ఎనిమిదీముప్పావే అయింది.

సూర్యం బస్టాండు దాటి కాఫీ హోటల్ కెళ్ళాడు.

టిఫిను, కాఫీ ముగించాడు. వక్కపొడి వేసుకున్నాడు.

పిక్‌నిక్‌కు తినూ ఏదైనాకొనుక్కెళితే బాగుండుననుకున్నాడు.

గారెలు కొందామా, కరకరలాడుతూ బాగున్నాయి .... అబ్బే .... మధ్యాహ్నానికి మెత్తబడిపోతాయి. అదీగాక "ఆవడలు తెస్తున్నాము' అని జగన్నాథం చెప్పాడు కూడా...

జగన్నాథం కాచిన పందెం గుర్తుకొచ్చింది. నవ్వు కున్నాడు సూర్యం.

కాసేపు అటూ ఇటూ తిరిగాక, ఓ డజను అరటి పండ్లు, రెండు బిస్కట్ పాకెట్లు కొన్నాడు. ఓ డజను వక్కపొడిపొట్లాలూ కొన్నాడు.

తొమ్మిదిన్నర అయింది. బస్టాండ్‌లోకి అడుగుపెట్టాడు. ఆంధ్ర దేశంలోని అన్ని బస్టాండుల వలెనే మూర్తీభవించిన అశుభ్రత, కన్పించింది అక్కడ. ఉజ్జాణాలు, మనుషులు, బస్సులు, ధూళి, అరుపులు – దాటి 'సుంకేశుల' బస్ దగ్గరికెళ్ళాడు. ఇంకో అయిదు నిముషాల్లో వస్తుందన్నారు. ఆదివారం గనుక కాస్త రద్దీ గానే వుంది.

"నమస్తే సార్!"

సూర్యం తిరిగి చూశాడు, ప్రెస్ వర్కర్ గంగయ్య.

"సుంకేశలకా సార్!"

"[illegible]!.... ఫ్రెండ్స్‌తో కలిసీ_"

"[illegible]ంలో మీరు కొనలేరు సార్.... నాకు చెప్పండి ఎన్ని టికెట్లు కావాలో – కండక్టర్ మనకు తెలిసినవాడే .." అని గంగయ్య డబ్బడిగి తీసుకెళ్ళాడు.

మరో పది నిముషాల్లో బస్ వచ్చింది, గంగయ్య బస్ లోపల కూర్చుని వున్నాడు. డ్రైవర్ వెనుకగా వున్న మూడు సీట్ల మీద తన తువ్వాలు పరిచి వుంచాడు.

జనం తొక్కిసలాట తగ్గాక సూర్యం ఎక్కుదామనుకున్నాడు. ఈలోగా కమల, జగన్నాధం వచ్చారు. ఒకరి చేతిలో టిఫిన్ కేరియర్, ఇంకొకరి చేతిలో బుట్ట వున్నాయి.

"ఆలస్యమయిపోయిందోయ్_" అన్నాడు జగన్నాధం.

"ఏం ఫరవాలేదు. సీటు రిజర్వ్ చేసి వుంచాను."

"రక్షించారు.... మా వారయితే అన్నీ హడావుడే:" అని నవ్వింది కమల.

అపుడే దండకం మొదలెట్టకు! రోజంతా వుందిగా –" అన్నాడు జగన్నాధం.

ముగ్గురూ కలిసి గలగల నవ్వుతూ ఎక్కి కూర్చున్నారు.

గంగయ్యకు కృతజ్ఞతలు తెలిపాడు సూర్యం. గంగయ్య వెళ్ళిపోయాడు.

9–50 కి అన్న బస్సు 10–20 కి బయలు దేరింది. 42 మందిని మోయాల్సిన బస్సు 58 మందితో గర్భవతిలా ప్రయాణం మొదలు పెట్టింది.

ఊరు దాటగానే చల్లనిగాలి పలకరించింది.

కమల జగన్నాధం ఒకరిమీద ఒకరు ఫిర్యాదులు చేసుకుంటుంటే తానెవరి పక్షం వహించాలో తెలియక తికమక పడిపోయాడు సూర్యం.

గంట లోపుగానే సుంకేశల చేరారు.

అక్కడి టెలిఫోన్ సిబ్బంది సాయంతో ముందుగానే బంగళాలో గదిని రిజర్వ్ చేయించి వుంచాడు జగన్నాధం. తిన్నగా

అక్కడికి వెళ్లి బరువైనంతా దించారు.

వెళ్తుంటే చెట్ల సందుల్లోంచి "రా రండి!" అని పిలిచింది తుంగభద్ర.

సూర్యం తను తెచ్చిన - అరటి పండ్లను బిస్కెట్ పాకెట్లను టేబిల్‌మీద పెడుతుంటే - "విన్నెవరు తెమ్మన్నారోయ్ ఇవన్నీ!" అని గద్దించాడు జగన్నాధం.

"సారె! మీ అంకట మీకేమీ తోచదు... ఆయనకు సంసారం అంటూ లేకపోయినా ఎంత బాధ్యతో చూశారా? అంది కమల.

"నీవంటి అనుకూలవతి, సుగుణాలరాశి భార్యగా దొరికాక నాకు బాధ్యత ఎందుకే భామామణీ!"

జగన్నాధం మాటల కామె సిగ్గులదు త్త అయింది.

ఆ ముచ్చట చూసి మురిసిపోయాడు సూర్యం

ముగ్గురూ బయటకు నడిచారు.

ఆకాశం, పక్కనే నది, దూరంగా కొండలు. పెళ్ళివందిట్లో బంధువుల్లా, స్నేహితుల్లా చెట్లు-వాతావరణం ఆహ్లాదంగా వుంది.

అనిర్వచనీయమైన ఆనందం ఆవహిస్తూంది,

నడిచి నడిచి ఆనకట్ట పక్కగా వున్న పిట్టగోడమీద కూచున్నారు, చుట్టుప్రక్కల ఎవ్వరూ లేరు.

నది నెమ్మదిగా పరుగెడుతూంది; ఎత్తు నుంచి పల్లంలోకి పడుతూంది.

ఆ పరుగులో ఎంత ఉత్సాహం! ఆ నడకలో ఎంతవిందుదనం!

"కమలా! ఏదయినా పాడకూడదూ?" అని జగన్నాధం అడిగితే సూర్యం ఆశ్చర్యంతో చూశాడు.

"మా ఆవిడ సంగీతం నేర్చుకుంది-" అని ప్రకటించాడు జగన్నాధం సగర్వంగా.

ఆమె తల వంచుకుని, కాళ్ళదగ్గర నీళ్ళపైన సుడులు తిరుగుతున్న నీటి వలయాలను చూస్తూంది.

రెండు నిముషాలు నిశ్శబ్దం.

సన్నగా కమ్మగా పలికింది ఆమె స్వరం

"గంగాసంగమ మిచ్చగించునే,

మదిన్ కావేరి దేవేరిగా అంగీకార మొనర్చునే,
యమునలో నానందమును బొందునే-
రంగత్తుంగ తరంగ హస్తముల
నా రత్నాకరేంద్రుడు
నీ యంగం బంటి సుఖించునేని
గుణభద్రా! తుంగభద్రానదీ!

"వండర్ ఫుల్!" అన్నాడు సూర్యం అప్రయత్నంగా. సాక్షాత్తూ సరస్వతీదేవి ఎదుటవున్నట్లుగా చూశాడామె వైపు.

"మా మామగారు తెలుగు మేష్టారు-" అన్నాడు జగన్నాధం సందర్భోచితమైన వివరణ ఇచ్చే ధోరణిలో.

ఆ పద్యం పాడగా జనించిన ఆనందలహరిలోంచి ఇవతలకి రావడానికిష్టంలేనట్లుగా కళ్ళు మూసుకునే వుంది కమల.

"ఎంతందంగా వుందండీ ఈ గీతం!"

"ఇది పద్యమయ్యా బాబూ! తెనాలి రామకృష్ణుడి "పాండురంగమహాత్యం"లోవిది-" అన్నాడు జగన్నాధం.

"కొంటెకవిత్వాల ఆ రామకృష్ణుడే ఇంత గొప్ప పద్యం రాశాడంటే ఆశ్చర్యంగా వుంది-"

"కొంటె తనమూ ఒక రకమైన ఇంటలిజెన్సే కదా. అందులోనూ "హ్యూమర్, వున్న మనిషంటే వాడు నిజంగా జీవితాన్ని "ఎంజాయ్ చేయగలవాడయి వుండాలి-" అంటున్న జగన్నాధం వైపు చూచింది అపుడే కళ్ళు తెరచిన కమల.

"ఏమిటీవాళ తమరింత అమోఘమైన ప్రవచనాలు వల్లించేస్తున్నారు-" అన్న కమల హెచ్చుపుకు

"సావాసదోషః:" అని సమాధానం ఇచ్చాడు జగన్నాధం.

ముగ్గురూ నవ్వారు.

"మీరేదన్నా పాడకూడదండీ?" అంది కమల

"ఎవరినడుగుతున్నారు, నన్నా?"-అని సూర్యం ఆశ్చర్యపోతుంటే-"ఆ రింకేంటి బదరీ! పనగాత్ర సౌలభ్యవిషయం-మా ఆవిడకెరుకేగద" అన్నాడు జగన్నాధం,

"అబ్బే-నేను పాడలేనండీ!" అన్నాడు సూర్యం

"ఉప్పుకప్పురంబు" కూడా రాదుటోయ్?

"ఎప్పుడునెడతెగక పారు నేరున్- అంటూ ఏదో ఒకటి లాగించేయి-" అని జగన్నాధం సలహా.

"ఏది-షేక్స్పియర్రాసినవేనా-" అని కమల చురక.

"అబ్బబ్బ.. మీఇద్దరిలో ఎవ్వరూ మాట తగ్గరు కదా-" అన్నాడు నవ్వడానికి శక్తిలేనట్లు

"సూర్యంగారూ ఈ తుంగభద్రానదిని చూస్తుంటే మీకు ఏమనిపిస్తూంది...ముందు మీరు చెప్పండి.-ఆ తర్వాత తమరు-" అందికమల జగన్నాధాన్నుద్దేశించి-

"చి త్రం!"

రెండు నిముషాలు ఎవరూ మాట్లాడలేదు.

"ఈ రెండు పాయల సంగమం దగ్గర చూస్తూంటే- పుట్టి పెరిగిన ఇంటికీ, చేబట్టిన భర్తకు మధ్య ఎటు వెళ్ళాలో తేల్చుకో లేని కొత్తపెళ్ళి కూతురు గుర్తుకొస్తూంది-"

"వస్తుందొస్తుంది- రావలసిన టైము కదూ-" అన్నాడు జగన్నాధం.

కమల సూర్యం దగ్గరసావచ్చి- "ఇంతకీ ఎవరో ఆ అదృష్ట వంతురాలు?" అంది రహస్యంగా అడుగుతున్నట్లు.

సూర్యం మనసొక్క నిముషం సాయిబాబా ఆలయంలోకి వెళ్ళింది. అక్కడ తుంగభద్ర నదివైపు మెట్ల మీద....

"అపుడే ఏవో ఊహ లోకాల్లోకి వెళ్ళిపోయారు సూర్యం గారు!"

తొట్రుపడి, సర్దుకుని- "అబ్బెబ్బె- ఏమి లేదండీ.... ఏమోయ్ జగన్నాధం! నదిని చూస్తే నీకేమనిపిస్తూందో చెప్పు-ఊ!" అన్నాడు సూర్యం.

"నాకా?" అని కాసేపు చాలా సీరియస్‌గా ఆలోచించినట్లు ఫోజుపెట్టి- "చేతికొచ్చిన మూడొందలనూ నెలసరి అప్పులవాడి కివ్వడమా, లేక పెద్దప్పు తాలూకు వడ్డీకి కట్టడమా- అని తేల్చుకో లేని ఎన్. జీ. ఓ. లా వుంది-" అని తేల్చాడు జగన్నాథం.

"నారికేళపాకం!" అని కమల కామెంట్.

"మరి మీకేమనిపిస్తూంది?" అని ఆమె నడిగాడు సూర్యం.

"ఆమె మళ్ళీ ఎంతో ప్రేమతో చూసింది పారుతున్న నదిని.

"అర్ధనారీశ్వరుడిలా వుంది, సాహిత్య సంగీతాల సంగమంలా వుంది."

"చాల 'పొయెటిక్'గా వుందండీ!"

జగన్నాథం గోడమీంచి కిందకు గెంతాడు. "లేడీస్ అండ్ జెంటిల్‌మన్. పొయెట్రీ సెషనయిపోయింది; ఇంక ఎజెండాలో తర్వాత ఐటెమ్. "ది గ్రేట్ ఆవడ ఈటింగ్ పోటీ!"

గెంతబోయిన కమలను "ఆగాగు! నువ్వలా గెంతకూడదు." అని చేయూతనిచ్చి దింపాడు. సిగ్గుతో అతడి చేతినందుకుని దిగింది కమల.

ముగ్గురూ నడుస్తున్నారు.

హఠాత్తుగా నది ఒడ్డున చెట్లకింద పిక్నిక్ పార్టీలో ఆమె!

"దుర్గా!" అని తాను గట్టిగా పిలిచినట్లు సూర్యానికి తెలియదు,

ఇటు కమల, జగన్నాథం. అటు దుర్గ శిలాప్రతిమల్లా నిలబడి పోయారు.

సూర్యాన్ని చూసి, తనతో వచ్చిన వాళ్ళతో చెప్పి, దుర్గ నెమ్మదిగా అడుగులు వేసుకుని వస్తుంటే అలా ఆమెను చూస్తూ నిలబడిపోయాడు సూర్యం.

దగ్గరికొచ్చి, "నమస్కారం!" అంది ఆమె.

జగన్నాథం, కమలలను చూస్తూ, సూర్యం "ఈవిడ దుర్గ!" అని పరిచయం చేశాడు.

"రండి!" అని కమల దుర్గ చేతిని పట్టుకుని తనవైపుకు లాక్కుంది.

"దుర్గగారూ! ఇతను జగన్నాథం అని నా అప్పుడు; ఆవిడ కమల. ఈ కాకి ముక్కుకు దొండపండు:" అన్నాడు సూర్యం.

"ఓహో! బాబుగారికి కూడా కవిత్వం వచ్చేస్తున్నట్టుందే. కమలా! పెన్ అండ్ పేపర్ ఏదీ. రాసుకుందాం ఈ కవి కోకిల పలుకుల్ని" అన్న జగన్నాథం మాటలకు పగలబడి నవ్వా

రందరూ.

"మా వారికి కొంచెం_" అని దుర్గతో ఏదో చెప్పబోయి కమల ఆగగా- "సూ్ర్ ఋాట్!" అని పూర్తి చేశాడు జగన్నాథం.

ఈమె ఇంత పొడవుందా! ఎంత చక్కని నవ్వు ఈమెది. ఆనాడు మసక వెలుతురలో చూడలేదు సరిగా, అని ఆమెనే తదేకంగా చూస్తున్నాడు సూర్యం.

"సూర్యం బాబూ! పువ్వులేమన్నా తెచ్చివుంటారా?" అంది కమల.

"పువ్వులా-ఎందుకూ-ఆ ట్బ్-"

దుర్గ తల క్రిందకు వంచింది

"ఉమ్!" అన్నాడు జగన్నాథం- "కధలన్ని తెలిశాయి ఓ చందమామా!" అన్న ధోరణిలో.

"మేమ్మగ్గురమూ తుంగభద్రను చూస్తే ఎవరికెట్లా తోచిందో చెప్పామండీ! మరి మీరూ చెప్పండి_" అంది కమల దుర్గతో_

"ఫస్ట్ ప్రైజ్.. నాలుగు ఆవడలు!" అని జగన్నాథం ప్రోత్సాహించాడు.

ఫక్కున నవ్వి-దుర్గ.... "నాకు... నాకు ...గంగలమవి పారే నీరంటే ఇష్టం_నదిని చూస్తూ అలాగే కూచుండిపోతే ఎంత బాగుండునో."

"బాగానే వుంటుంది కానీండీ....ఆ ఇంటి మగాడు కూడా మూడు పూటలా నదీజలం తాగి పడుకునేవాడయి వుండాలి కదండి_" అన్నాడు జగన్నాథం.

సిగ్గుల మందారమయింది దుర్గ.

సూర్యం ఎదలో వేయి పండుగలు!

కమల పలికింది; "మీరు సరియైన సమయానికే వచ్చారు-ఈ మిత్రులిద్దరూ 'ఆవడల పోటీ'లోకి దిగబోతున్నారు. మనం చూద్దాం రండి:"

జగన్నాథం...."నో! అనివార్య కారణం వల్ల పోటీనింకో అరగంట వాయిదా వేస్తున్నాము_" అన్నాడు.

"ఎందుకు? ఏమిటా కారణం_" అని అడిగాడు సూర్యం.

"ఏం కారణమేమిటోయ్! మేమిద్దరం పొద్దుటి నుండి కాన్ఫ్రెన్సయినా ఒంటరిగా లేకపోతిమి కదా....అంచేత నేనీ అమ్మాయిని లేవదీసుకుని-అలా" అంటున్న జగన్నాథం నోటిని మూసేసింది కమల.

సూర్యం, దుర్గ గలగలా నవ్వారు.

"అంచేత-దుర్గ గారు! ఈవిడ నా సహధర్మచారిణి ...మేమిద్దరమూ కొన్ని ఆధ్యాత్మిక విషయాలు మాట్లాడుకోవాలి. సో... విత్ యువర్ పర్మిషన్...." అంటూ కమల చేయి పట్టుకుని దిర దిరా లాక్కెళ్ళిపోయాడు జగన్నాథం.

వారివైపు చూస్తూ- "గ్రేట్ కపుల్" అన్నాడు సూర్యం.

తల వూచింది దుర్గ.

"రండి... అలా నడిచి వద్దాం-" అన్నాడు సూర్యం.

అతడితోబాటు అడుగులు వేయసాగింది దుర్గ.

దూరంగా ఫిషరీస్ పాండ్ దాకా వెళ్లాక అక్కడొక చెట్టు నీడలో కూర్చున్నారు.

"మీ పేరు సూర్యమా-"

"ఓ స్సారీ! ఆ రోజు మీ పేరడిగాను, కాని నా పేరు చెప్ప లేదు. మిమ్మల్ని చూడగానే...." అని సగంలో ఆగిపోయిన సూర్యాన్ని కళ్ళతో అడిగింది.

"..నన్ను నేనే మరచిపోతుంటాను-అని ఇవాళ తెలిసింది.."

నవ్వును అదిమి పెదాల క్రింద దాచి, వేలితో మట్టిలో ముగ్గులు వేయసాగింది దుర్గ.

"దుర్గా!"

చూచింది ఆమె.

"మీ కభ్యంతరం లేకపోతే-నా గురించి చెబుతాను వినండి."

ఆమె విన్నది; తర్వాత అతడు విన్నాడు.

-అర గంటయ్యాక వాళ్ళు వెనక్కు నడుస్తున్నారు.

ఇంకా కాస్త దూరంలో బంగళా వుందనగా ఆమె సుతారంగా తన చేతిని విడిపించుకుంది.

"దుర్గా! నిన్ను....నిన్ను....మళ్ళీ ఎప్పుడు చూడనూ?"

మాట్లాడలేదామె: కళ్ళతో నవ్వింది. పెదాలతో కలలు పంచింది. తన హాస్టల్ బృందం వద్దకు వెళ్ళిపోయింది.

సూర్యం తన చేతిని చూసుకున్నాడు.

దుర్గ చేపట్టిన ఈ చేయి మంచి చేయే అనుకున్నాడు.

తుంగభద్ర ఉషారుగా పరుగులిడుతూంది.

o o o

మూడు వారాల తర్వాత ఒక శుక్రవారం ఉదయం_జగన్నాథం ఇంట్లో— అతి నిరాడంబరంగా జరిగింది సూర్యం, దుర్గల వివాహం.

జగన్నాథం దంపతులు, ప్రెస్ మిత్రులు ఇద్దరు, దుర్గ హాస్టల్ సూపరింటెండెంటూ, ఆమె భర్త— ఆరుగురంటే ఆరుగురే అతిథులు!

ఒక వారంరోజులు సెలవు పెట్టి హంపి, మహానంది, లేపాక్షి తిరిగి వచ్చారు దంపతులు.

కమల ఎంతో ఆప్యాయతతో వాళ్ళ కొత్త కాపురానికి కావలసినవన్నీ సమకూర్చి పెట్టింది.

నరసింహారావుపేటలో గదిలో కాపురం మొదలు పెట్టారు సూర్యం, దుర్గా.

అనుకోకుండా వాళ్ళజీవితంలో ఇంకో మలుపు కూడా ఎదురయింది.

జగన్నాథం అన్నయ్య సత్యనారాయణ విశాఖపట్నంలో షిప్‌యార్డ్‌లో ఇంజనీర్‌గా వుంటున్నాడు.

విశాఖపట్నంలోని ఒక పెద్ద రెడీమేడ్ దుస్తుల ఎగుమతి కంపెనీలో సూపర్‌వైజర్ ఉద్యోగం ఖాళీగా వుందనీ, దాదాపు రెండు వందలమంది దాక పనిచేసే వారిమీద సూపర్‌వైజర్‌గా నమ్మకస్తుడు కావాలనీ, నెలకు నాలుగు వందల దాక జీతంఇస్తారనీ రాశాడాయన.

ఈ విషయం సూర్యానికి జగన్నాథం చెప్పాడు.

"ఈ పాడు ప్రెస్‌పని ఎప్పుడొదులుతుందా అని చూస్తున్నా- వెంటనే రిజైన్‌చేసి వెళ్ళిపోతా!"నన్నాడు సూర్యం.

"తొందరపడకండి. అక్కడికోసారి వెళ్ళి పరిస్థితులన్నీ

చూచిరండి..ఆ తర్వాత ఒక నిర్ణయానికి రావచ్చు-"అంది దుర్గ.

"అమ్మాయి చెప్పింది కరెక్ట్..అల్లా చేయి-"అన్నాడు జగన్నాథం... నువ్వు మా ఇంటికొచ్చి వుండమ్మా ఆ నాలుగురోజులూ"

"వద్దన్నయ్యా! నేను రోజూ టైపింగ్ క్లాసులు తీసుకోవాలికదా సెంటర్లో-"

"ఇంకేం క్లాసులు..అన్నీ మానేయాల్సిందే.." అన్నాడు సూర్యం,

"అలాగేలెండి .మీరు విశాఖపట్నం వెళ్ళొచ్చాక మాట్లాడదాము-" అంది దుర్గ.

ఆదివారంతోబాటు ఇంకో మూడు రోజులు కలిసి సెలవుపెట్టి విశాఖపట్నం వెళ్ళాడు సూర్యం. అసలు విశాఖపట్నం వెళ్ళాలంటే తాను దిగాల్సిన స్టేషన్ పేరు వాల్తేరు అని తెలిసి చాలా ఆశ్చర్యపడ్డాడు.

సత్యనారాయణగారిని కలుసుకుంటే ఆయన ఆ ఎగుమతుల కంపెనీ డైరెక్టరు సుదర్శనంగారి ఫోను నెంబరు ఇచ్చారు.

సుదర్శనం గారిని కలిశాడు సూర్యం. వివరాలన్నీ చెప్పాడు. ఆయన గుచ్చి గుచ్చి అడిగిన ప్రశ్నలన్నిటికీ ఓపికగా సమాధానం చెప్పాడు.

"అయితే మిస్టర్ సూర్యం! మీరు అప్లికేషన్ ఇచ్చివెళ్ళండి నేనుబోర్డు ఎదుట వుంచి నిర్ణయం తీసుకున్నాక- మీకు తెలుపడం జరుగుతుంది." అని పైప్ వెలిగించాడు ముప్పై యేళ్ళ సుదర్శనం.

నమస్కారం పెట్టి సెలవు తీసుకున్నాడు సూర్యం.

వాల్తేరు స్టేషన్లో ఏటికొప్పాక బొమ్మల రాజురాణి ఒకటి, అరకిలో మామిడి తాండ్ర కొన్నాడు.

కర్నూలు వచ్చి చేరాడు.

మామిడి తాండ్ర మొదటిసారిగా రుచి చూచిన దుర్గ-"ఇది ఇలాగే కమలగారి కిచ్చేద్దామండి-" అంది.

"ఏం?"

"ఆవిడకిప్పుడు ఆరో నెల. పుల్లగా తియ్యగా బాగుంటుంది తినడానికి-"

"అంటే వారి రుచులు ఇలా వుంటాయని తమకెలా తెలుసు మేడమ్!" అన్న సూర్యం నోటికామె వేళ్ళు తాళం వేశాయి.

పదిహేను రోజుల తర్వాత- విశాఖపట్నం కంపెనీనుండి సూపర్‌వైజర్ ఉద్యోగానికి సూర్యాన్ని ఎన్నిక చేసినట్లు ఉత్తరం వచ్చింది. జీతమూ, అలవెన్సులు కలిపి నెలకు నాలుగు వందల ముప్ఫై రూపాయలు ఇస్తామనీ, అంగీకారం అయ్యే పక్షంలో మూడు వారాలలోగా వచ్చి చేరాలనీ రాశారు.

ఆఫీసు కొచ్చిన ఆ ఉత్తరం పట్టుకుని ఆ సాయంత్రం ఇంటి కొచ్చిన సూర్యం- వంటింట్లో ఏదో పని చేసుకుంటున్న దుర్గ నమాంతం పైకెత్తేసి గిరగిర తిప్పాడు.

భయంతో కళ్ళుమూసుకుని "బాబోయ్! నే పడిపోతానండోయ్. దింపండోయ్-" అని అరిచింది.

ఆమెను దింపి, ముద్దు పెట్టుకున్నాడు.

"ఛీ! ఏమిటీ పని."

"డ్యూటీ మేడమ్ డ్యూటీ! అందుకోండి ఈ చిట్టీ!"

ఆమె కళ్ళు విప్పారాయి.

—ఆ రాత్రి పడుకున్నప్పుడు ఆమె ఒక సందేహం వెలి బుచ్చింది. "మరిక్కడయితే నాకూ ఏదో నెలకో వంద వస్తూం కదా. అలాటిది అక్కడ వుంటుందంటారా?"

"తప్పకుండా వస్తుంది. రాకపోయినా ఫరవాలేదు. అయినా ఇంకో రెండేళ్ళ తర్వాత నువ్వుద్యోగం చేయడానికి నే నొప్పుకున్నా పాపాయి ఒప్పుకోదు."

ఆతడి నోటికి మూతపడింది.

సూర్యం ముందుగా వెళ్ళి విశాఖలో చేరాడు డాబా గార్డెన్స్ ప్రాంతంలో ఒక మేడమీద రెండు చిన్న గదుల వాటా నెలకు వంద రూపాయల అద్దె చొప్పున కుదుర్చుకున్నాడు. వెంటనే కర్నూలు వెళ్ళాడు. అక్కడ మిత్రులందరి దగ్గర సెలవు పుచ్చు కున్నారు.

"ఒక్కసారి సాయిబాబా గుడికి వెళ్ళొద్దామా?" అని అడిగింది దుర్గ.

పెళ్ళేరు.

"నన్ను మాత్రం విగ్రహాలకు దండాలు పెట్టమనీ బలవం
చెయ్యకు ప్లీజ్!"

"చెయ్యను! మీకా నమ్మకం లేదని నాకు తెలుసు"

"ఎలా తెలుసు? ఈ విషయమై నేనెప్పుడూ నీతో మాట్ల
లేదే."

"ఆ రోజు ఈ గుడిలో మనం కలిసినప్పుడు, కుంకు
వున్న కొబ్బరిచిప్పను మీ చేతికిస్తే, మీరు బొట్టుపెట్టుకోకుం
కొబ్బరిముక్క మాత్రం తీసుకోవడం గుర్తుంది."

"అయ్య బాబోయి- నాకు భయంగా వుంది! నీ అ
లోతైన మనిషి దగ్గర ఓడిపోతానేమో చివరకి- అని."

"వద్దు లెండి! నేనే ఓడిపోతానుగా-" అని నవ్వింది దుర్గ

ఆమె పూజ చేయించింది. బాబాకు మనసారా దండం పె
కుంది. మెట్లుదిగి అతడి చేయిపట్టుకుని నదివైపు నడిచింది.

"ఇదిగో.... ఇక్కడే ... దేవీజీగారు ఆసీనులయి భక్తుడి
కటాక్షించింది —"

"ష్ ... ఎవరన్నా వినగలరు!"

కమల, జగన్నాథం కనుల నీరు నిండుతుండగా వీడ్కో
చెప్పారు.

"నాకూ ఇక్కడ అయిదేళ్ళయిపోయిందోయ్-బదిలీ చేయిం
కుని వచ్చేస్తానటు-" అన్నాడు జగన్నాథం.

ప్లాట్‌ఫారమ్మీద నిలబడిన ఆ దంపతులు చుక్కలా
అదృశ్యమయేదాకా రైలు పెట్టెలో నుండి చేతులు వూపారు దుర్గ
సూర్యమూ-

o o o

సూర్యం సూపర్‌వైజర్‌గా చేరింది "మహాలక్ష్మి కంబైన్స్
వారి గార్మెంట్ ఎక్స్‌పోర్ట్ డివిజన్‌లో.

ఆ కంబైన్స్ అధిపతులు కోటీశ్వరులయిన దేవా హనుమా
ప్రసాద్ గారు.. ఆయన ఇప్పుడు ఏనభై ఐదేళ్ళు దాటడంతో
ఆముష్మిక విషయాలలో పడ్డారు; మరీ అత్యవసరం అయితే తప్ప

జినెస్ వ్యవహారాలలో తల దూర్చరు. వారి అబ్బాయి రాజేశ్వర
ప్రసాద్ హయాంలో బిజినెస్ బాగా ముదిరింది: లక్షలు కోట్లు
య్యాయి; రాజేశ్వర్ కిప్పుడు అరవై ఏళ్ళు: ఆయన పాతిక
ంపెనీలలో డైరెక్టరు: వాణిజ్య మండలి ఉపాధ్యక్షులు.
రాష్ట్రాని ఏ మంత్రి వచ్చినా వారింట్లో ఒక గ్లాసు బీరయినా తాగ
ండా పోడు, ఆయనకు "కింగ్ మేకర్ అన్న వ్యావహారిక నామం
ాడా వుంది.

వారి చిరంజీవే సుదర్శన ప్రసాద్... పరుపుల్లాటి తివా
లమీద నడవడం, ఓడలాటి కార్లలో తిరగడం, రంభల్లాంటి మణి
ణులతో లైఫ్ని ఎన్జాయ్ చేయడం, భార్య లలిత తో సుదర్శన
ప్రసాద్ తో పాటు మూడు నెలలకోసారి తిరుపతి వెంకటేశ్వరుడి
ర్శనం చేసుకుని హుండీలో పడవేసేందుకు తక్కువలేకుండా ముడుపు
యడం_ఇవి వారిని గురించిన రేఖాచిత్రంలో గల కొన్ని రేఖలు..

వయసు ముప్పైఏ అయినా, తరతరాల నుంచే రక్తంలో
ప్రించిన వ్యాపార సూత్రాల బలంతో బిజినెస్ను దినదినాభివృద్ధి
స్తూవస్తున్నాడు సుదర్శనప్రసాద్. తన హయాంలో "మహాలక్ష్మి
ంబైన్స్" క్రింద ఒక మత్స్యాహార హోటల్ కట్టించే యత్నంలో
న్నాడు. చుట్టుపక్కాల వూళ్ళతో కలిపి నాలుగు సినిమా థియేటర్లు
ట్టించాడు, తద్వారా చలనచిత్రరంగంలో పలుకుబడిసంపాదించాడు.
దివలది మెట్రిక్కే-అయినా దేశదేశాలూ తిరిగి అనుభవం విద్యలో
క్కువ రేటు పుచ్చుకున్నాడు. రైసీసెరస్ ఇంటర్నేషనల్" అన్న
ంతర్జాతీయ సంస్థలో సభ్యుడిగా ఏడేళ్ళు చేసి ఇప్పుడే సదరు
ంస్థ యొక్క 632వ జిల్లాకు గవర్నరుగా ఎన్నికయ్యాడు.
ఆ కంబైన్స్ క్రింది వివిధ సంస్థలలో కలిపి ఉద్యోగులూ, కార్మి
లూ దాదాపు నాలుగువేల మంది దాకా పనిజేస్తున్నారు.

వారి 'గార్మెంట్ ఎక్స్పోర్ట్స్' విభాగంలో రెండు వందల
పాతికమందిదాక ఉద్యోగులు,కార్మికులూవున్నారు; బట్టలుకొనుగోలు
చేసేవారు, కత్తిరించేవారు, డిజైనర్స్, దర్జీలు, ఇస్త్రీవారు, పాకర్స్,
షిప్పింగ్ సెక్షన్ ఇంజనీర్స్— వాళ్ళుగాక పర్సనెల్, అకౌంట్స్
లవాళ్ళున్నారు.

ఆఫీసర్ స్థాయి వారొక ఇరవై మంది వుంటారు; కార్మిక స్థాయివారు రెండు వందలుంటారు. ఆ కంపెనీ తయారు డ్రెస్సులు యూరప్‌లో, అమెరికాలో విపరీతంగా అమ్ముడు పో న్నాయి. దినానికీ వ్యాపారం పెరుగుతూంది. పని సరిగ్గా జరిగేలా చూడడం, ఎక్కడా ఏ కార్మికుడూ కాలం వృధా చేయకుం చూడడం, మెషిన్లలో ఏదయినా అవరోధం వస్తే మెయింటినె వాళ్ళను పిలిపించి బాగుచేయించడం, ఆర్డర్ల వ్యవధి ప్రకా దుస్తులు తయారీ కార్యక్రమం సాగేలా చూడడం‒ ఇవి.... సూ వైజర్‌గా సూర్యం డ్యూటీలు. ఎనిమిది నెలలు చకచకా గ పోయాయి.

o o o

తొమ్మిదింటికి సైరన్ వూదేసరికి అందరూ తమ త చోట్లలో పని మొదలుపెట్టారు.

సూర్యం ఒక రౌండ్ వెళ్ళి వచ్చాడు.

దర్జీలలో ఇద్దరు రాలేదు. ఒకరు శ్రీరాములు; అతడి నుం సెలవు చీటీ వచ్చింది.

రెండవ వాడు అప్పన్న; అతడి నుండి ఏ ఖబురూ లేదు.

శ్రీరాములు పేరు ఎదుట "ఎల్" అని రాశాడు సూర్య అప్పన్న పేరు ఎదుట "ఆబ్సెంట్" అని వేయబోయి ఆగా సూర్యం.

పావు గంట తర్వాత వగర్చుకుంటూ వచ్చాడు అప్పన అతడి గదిలోకి.

"దండాలు బాబూ!"

"ఏమయింది అప్పన్నా!"

"మా ఆవిడకు నిన్న రాత్రినుండి ఒకటే రక్తపువిరేచనాలం కళ్ళల్లోకి ప్రాణం వచ్చేసినాది.... ఆస్పత్రిలో చేర్పించమన్నార డాక్టరుగారు. ఉదయాన్నే లేచి ఆస్పత్రికెళ్ళినామండి. పా రూపాయలదాకా ఖర్చయిందండి. ఇంకా ఎడ్మిషనవలేదు, ఈలో ఫ్యాక్టరీకి టైమయిపోతాందని మా తమ్ముడిని వుంచి పారొ నానండీ!"

"సెలవు పెట్టలేకపోయావా!"

"నేనే జబ్బుపడ్డానుకదండీ! ఏడాదికిచ్చే పాతికరోజులసెలవూ
జబ్బుకే అయిపోయిందండీ."

"అలాగా. పోన్లే... పనిలోకి వెళ్ళు."

"బాబూ! నాకివాళ లేటు కూడా వేయకండి! ఈ నెల్లో ఇప్ప
కి రెండు లేటు మార్కులు పడ్డాయి. మూడయితే ఒకరోజు జీతం
సే సారండీ. ఇంటో పరిస్థితి బాగాలేక ఈ నెల ఇట్లా అయింది
వి నేనెప్పుడూ లేటుగా రాను బాబూ! రోజు జీతం పది రూపా
యలు పోతే చాల బాధయిపోతుంది." అని కళ్ళనీళ్ళ పర్యంతం
యిన అప్పన్న వీపు తట్టి" నువ్వెళ్ళు అప్పన్నా! కష్టాలు అంద
కీ వస్తాయి. నువ్వెళ్ళు అన్నాడు."

నమస్కారంచేసి వెళ్ళిపోయాడు అప్పన్న.

సాయంకాలం ఇంటికి వెళ్లాడు సూర్యం. అతనూ దుర్గ కలిసి
చికి వెళ్లారు.

రామకృష్ణా బీచ్‌దగ్గర బాగా జనం వుండడంచేత అలా నడుచు
ంటూ ఈస్టు పాయింట్ లైట్‌హవుస్‌దాక వెళ్లారు. అలలు పాదా
ను తడిపేలా అంచున నిల్చున్నారు.

కడలి మహోత్సాహంతో గెంతులు వేస్తున్నది. యజమానిని
ూసిన శునకంలా కెరటాల తోకలనాడిస్తున్నది. భరతనాట్యసుందరి
లాంచలంలా ఎగిరెగిరిపడుతున్నది. అస్తమించే సూర్యుడి బంగా
ంలోవి ఇంద్రధనుస్సులకు శత సహస్ర దర్పణాలు పడుతున్నది.

ఇసుకలో కూచున్నారు. బటాణీ, వేరుశెనక్కాయలూ
న్నారు. కబుర్లు చెప్పుకున్నారు.

"ఏమండీ! ఇంకో నెలకి మన పెళ్ళయి సంవత్సరమవు
ంది కదూ?"

"ఔను... మరి వెడ్డింగ్ యానివర్సరీ గిఫ్ట్ ఇంకా ఏమొప్ప
ియ వైతివి!"

అతడి ఒడిలో తల దాచుకుంది ఆమె.

కడలి తరంగం ఉవ్వెత్తున లేచి తీరాన్ని కౌగిలించుకుంది.
నివితీరా చుంబించింది.

మరుసటిరోజు ఫ్యాక్టరీలో అటెండెన్స్ వగైరా పనులన్నీ ముగించుకొని రౌండ్స్‌కెళ్దామనుకుంటున్నాడు సూర్యం.

ఆలోగా "చినబాబుగారు పిలుస్తున్నారు" అని కబురు వచ్చింది.

'నన్నా! సుదర్శన ప్రసాద్‌గారా?' అని ఆశ్చర్యంగా ఫ్యాక్టరీ వెలుపలికి వచ్చి అదే ఆవరణలో వున్న రెండస్తుల భవనం లోని మేడమీద గదిదగ్గరికి వెళ్ళాడు.

శ్రీవారి పి.ఎస్. అనబడే మల్లికార్జునరావ్‌ని కలిసి చెప్పాడు. అతడి నవ్వు అలా వుందేమా అనిపించింది.

అనుమతి వచ్చింది.

టెన్నిస్‌కోర్టంత గది; ఊటీలా ఉంది; ఒకమూలగా 'టెన్ బై-సిక్స్' మేజా వుంది. దాని వెనకాల స్వివెల్‌చెయిరుంది. దానిని నిండుగా కూచునివున్నారు చినబాబుగారనబడే సుదర్శనప్రసాద్. వెనకాల వారి నెత్తిమీద గాంధీజీ ఫోటో వుంది. ఆ ప్రక్కనే ఎవరో బాబాజీగారి పటం వుంది.

టేబిల్‌మీద మూడు రంగుల్లో టెలిఫోన్‌లున్నాయి. పొగ సృష్టిస్తున్న పైపుంది. కలాలున్నాయి; కేలెండరుంది; కత్తి వుంది; ఇంటర్‌కామ్ వుంది.

ఆ గదిలోకి రావడం సూర్యానికిదే మొదటిసారి.

"నమస్కారమండీ!"

"ఏం సూర్యం! బాగున్నారా?"

"బాగున్నాను సార్!"

"పనెలా వుంది?"

"బాగుందండి!"

"ఈ ఎనిమిది నెల్లోను మీమీద ఏలాటి కంప్లయింట్లు రాలేదు..." తేలు కుట్టినట్లయింది సూర్యానికి.

"మీ వర్క్ మీరు సక్రమంగా చేసుకుపోతున్నారు- అప్రీషియేట్ ఇట్... కాని." సస్పెన్స్‌తో చచ్చిపోతున్నాడు సూర్యం.

పైప్ చేతిలోకి తీసుకుని, ఒక్కసారిగా గట్టిగా పీల్చి కుర్చీని గిర్రున తిప్పి, పక్కనున్న స్టూల్‌మీద కాళ్ళుపెట్టి, పై

ుస్తూ పొగ వదులుతూ..  "కాని... నిన్న ఉదయం పనిలోకి
పుగంట లేట్‌గా వచ్చిన అప్పన్న అనే వర్కర్ రైట్ టైమ్‌లో
చ్చినట్లు మార్క్ చేశారట- నిజమేనా.,."

పాదాల అడుగున భూమి కదలుతున్నట్లయింది సూర్యానికి,
ట మాట రావడం లేదు.

"నిజమే! ఈ టేబుల్ దగ్గర కొచ్చే వార్త నూటికి నూరు
ళ్ళు నిజం తప్ప మరొకటి అయి వుండడానికి వీలులేదు..."

"అది కాస్సార్!..."

"నిజం కాదా?"

"నిజమే కాని. ."

"మరి?"

"అతడి పరిస్థితి చాల దయనీయమైంది సార్! అంచేత.

"నో నో నో! వ్యక్తిగా మీకు దయవుంటే ఐదో పదో
వ్వండి. కాని ఫ్యాక్టరీ కాలంలో పావుగంట దానం చేసే హక్కు
మ లేదు... అర్థమయింది కదూ! వర్కర్సన్నాక ఏవో సాకులు
ుతుంటారు. అవన్నీ నమ్మేయకూడదు. కాక్ అండ్ బుల్ స్టోరీస్
ప్పే వాళ్ళు ఫ్యాక్టరీల్లో పని చేయకూడదు. పత్రికల్లో సీరియల్స్
యాలి. ఇది మీ మొదటి తప్పిదం కనుక నేను మరచి పోవడానికి
ం... మళ్ళీ ఇలాంటివి జరగకూడదు-

"ఎస్సార్"

"మామూలుగానయితే మీరీ గదిలోకి కూడా వచ్చివుండేవారు
ు. మీ చేతికి ఓ కాగితం వచ్చి వుండేది. కాని మిమ్మల్ని
్యనారాయణ పంపారని నాకు గుర్తుంది. రెండవ సారి
ర్తుండదు....

"ఎస్సార్!"

"యు కెన్ గో!"

బోనులోంచి బయట పడ్డట్లు పడ్డాడు. అవమానంతో తల
ప్పేసినట్లయింది.

తన గది కొస్తుంటే అందరూ తనకేసి చూస్తున్నట్లు, తన్ను
ంచే మాట్లాడుకుంటున్నట్లు అన్పించింది,

అది భ్రమేనా ?

వర్కర్సంటే మనిషా, కాదా.... వాడి కొచ్చే కష్టాన్ని యజమాని కాకపోతే ఎవరు చూస్తారు ? యంత్రానికి మరమ్మత్తువస్తే దాన్ని అపురూపంగా చూచుకుని వందలు వేలు పెట్టి బాగు చేయిస్తారే.... అది మళ్ళీ పని చేసేలా చూస్తారే. మరి మనిషి ఆ పాటి చెయ్యడా ? అతడి మనసు శరీరమూ ఆరోగ్యంగా వుంచక పోతే అతడు మనస్ఫూర్తిగా ఎలా పనిచేయగలడు? — సంపద ఉత్పత్తిచేసే ఈ మనుషులను నిర్లక్ష్యం చేసిన సమాజం ఎలా ముందడుగు వేస్తుంది ఇవి సూర్యం మెదడును వేధించిన ప్రశ్నలు.

ఇంకొకవైపు డబ్బు ఇచ్చే మదం, అహంకారం, గర్వం దాని వికృత రూపం కలవరపెట్ట సాగాయి. ఆ రాత్రి మొదటిసారిగా దుర్గ అతడు ఒకొకరుగా వుండటం గమనించింది. అతడేమి చెప్పక పోవడం ఆమెకు ఆశ్చర్యం అనిపించింది. ఆఫీసు విషయంలో ఆమె మనసునెందుకు పాడు చేయాలని అతిడూరుకున్నాడు

మరునాటి రోజు ఏదో పనిమీద అకౌంట్స్ ఆఫీసరు శ్రీపతి గారి దగ్గరకు వెళ్ళాడు సూర్యం పని అయ్యాక ఆయన సూర్యంతో ఇలా అన్నారు. "చూడు నాయనా ! నాకు కంపెనీ సేవలో ముప్పై యేళ్ళు గడిచాయి ఎందుకో నాకు నువ్వంటే అభిమానం ఏర్పడింది గనుక చెబుతున్నాను.... మన కర్మగాలి పొట్ట గడవక ఇక్కడ కూలి కొచ్చాము. ఇక్కడ అన్ని రకాల క్రూర జంతువులూ వుంటాయి. "తలనుండు విషము ఫణికిని" అన్నట్లు పామో, తేలో, సింహమో అంటే గుర్తించి మన జాగ్రత్తతో మనం వుంటాము. గనుక అతి మెలకువగా వుండు తండ్రీ" అన్నారు.

సూర్యానికి కంతా అయోమయంగా వుంది.

నిన్నటి విషయం ఈయన కెలా తెలిసింది ? ఏమిటిదంతా ? ఏమిటీ వాతావరణం ?

ఆ ప్రశ్నలకు జవాబు ఇంకొకరిద్వారా లభించింది. ఆ ఇంకొకరు షిప్పింగ్‌లో వుండే బెంగాలీ మిత్రుడు ప్రఫుల్లో చంద్రో సర్కార్.

సాయంకాలం హోటల్లో కాఫీ తాగుతూ చెప్పాడతడు :

"భాయి.... అనవసరంగా గొడవపడి పోకు. ఇక్కడ చాల వల
యున్నాయి. అందులో ఒక వలయం యూనియన్. దాని నాయకు
మధుసూదనం మా విభాగంలో గుమాస్తా....కనుక ఆ తాకిడి నా
తెలుసు. ఈ యూనియన్ ప్రారంభించింది వరహాలు అవి చా
పెద్ద మనిషి. అతడు వున్నంతకాలం యూనియన్ వ్యవహారా
శుభ్రంగా వుండేవి అతడు చనిపోయాక మధుసూదనం
షద్దితో పైకి వచ్చాడు. అతడి దురుసయిన మాటలకు, అంతకన్న
వికారమైన చేతలకు రోతపుట్టి చాలమంది అతడి యూనియన్ మ
బయటి కొచ్చేశారు. అయినా వుంది ఒకటే యూనియన్ మెజారి
అతడితోనే వున్నారు. అదీ అతడి గర్వం.

"పన్న నువ్వు కాసంత సాయం చేసిన అప్పన్న మ
యూనియన్ నుండి బయటికి వచ్చేసిన వాళ్ళలో ఒకడు అంతే
నువ్వు అతడికి సాయం చేశావన్న వార్తను నిమిషాలమీద మ
తాలూకు మనుషులు పసిగట్టి భక్తి శ్రద్ధలతో వాడికి చేరవేశారు
వాడు పైకి చెప్పి వుంటాడు అంచేతే నీకు దొరగారి దర్శ
భాగ్యం లభించింది ఇక్కడినుంచి వాళ్ళు నిన్ను కనిపెడుతు
వుంటారు. వారికి వుపయోగపడితివా మంచిదే; నీ మానా
నువ్వుండినా పరవాలేదు, కాని వాళ్ళ యూనియన్‌లో లేని వాళ
పట్ల నువ్వేదయినా జాలి చూపిస్తివా....నిన్ను వదలడు "

"ఎంత అన్యాయం!"

"అన్యాయం కాదు భాయి, ప్రపంచం....!" అన్నాడ
సర్కార్ బరువుగా నవ్వుతూ!

వెల్ఫేర్ ఆఫీసర్ దేవదాసం....తన ఎదుటవున్న కాగితా
చూసుకుంటున్నాడు...అందులో ఒక అడ్వాన్స్‌కు అప్లికేషన్ మం
మెయింటినెన్స్‌లో సీనియర్ మెకానిక్ కామేశం అన్నాతను
జబ్బుపడి వున్నాను గనుక జీతం రావడం లేదని, వెల్ఫేర్ ఫండ
నుండి అయిదొందల రూపాయలు అడ్వాన్సుగా ఇమ్మని నెలకు
పాతిక చొప్పున వెనక్కు కట్టుకొమ్మని రాశాడు.

పెన్సిల్ నోట్లో పెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు దేవదానం

"కామేశం " పోయిన సంవత్సరం వాడికేదో అవార్డు కూడా

వచ్చింది కదూ - దట్స్ రైట్ ! ఆ సభకు వాడు, వాడి భార్యా వచ్చారు.... ఆ.... అదే....

ఫోనొచ్చింది...

"—"

"హలో డార్లింగ్... !"

"—"

"ఎపెస్ ఎనిటీ, వీకెండ్ ప్రోగ్రాం కేన్సిలా ?"

"అబ్బా .."

"ఎప్పుడూ, వచ్చే కనీ, అది_రెండు రోజులూనా_నిజంగానా... నో.... నో.... మిస్సస్ మరో నెలవరకూ రాదు....ఎళ్ళే...డెలివరీ కాదు....హహ"

"వ్వా.. ఓ కే. !"

...ఫోన్ పెట్టాడు

ఆ మేళం అంటే వా దేవన్నమాట...

ఓ..కే...

ఆ అడ్వాన్స్ విషయం మాట్లాడ్డానికి ఎల్లుండి సాయంకాలం ఇంటికి ఇ టికి రమ్మనమని కామేశానికి కబురుపెట్టాడు.

రెండ్రోజుల తర్వాత —

సాయకాలం ఏడున్నర పాటికి —

దేవదానం ఇంటిలోకి —

పెద్ద రగ్గు కప్పుకుని..భార్యని సాయం తీసుకుని వచ్చాడు కామేశం...

"ఓ .కామేశమా ! రావోయ్...రా !"

"దండాలండీ ."

"నీ అడ్వాన్స్ విషయంలో ఒక పేచీ వుందోయి... ఇలా లోపలికిరా ...మాట్లాడదాం ..అదెవరు...నీ భార్యా... ఓకె. ఇక్కడ కూర్చోపను..."

హాలు దాటి ఇంకొక గదిలోకి వెళ్ళారు. కాస్సేపు తర్వాత పరుగెత్తుకొచ్చాడు . దేవదానం.

"నీ పేరేమిటి. .?"

"సీతండీ..."

...సీత మంచిపేసి..నల్లతోలు....ఇట్ ఏ నైస్ వెన్చ్ :

"మామ సీతా ! మీ ఆయన బాగా నీరసంగా వున్నట్లున్నాడు. అక్కడ మగతగా పడుకున్నాడు "

"ఏటయ్యింది బాబయ్యా ! ఏటయింది మా వాడికి.... అయ్యో...ఇరవై రోజుల జ్వరం పీల్చేసింది. మావా ! నువ్వెళ్ళొద్దు అంటే విన్నాడు కాదు__" అని ఏడుస్తూ అందామె ఏమీ పరవాలేదు సీతా ! ఇలా రా: నేను డాక్టర్కు ఫోన్ చేశాను. వస్తాడిప్పుడే..."

ఆమె ఏడుస్తూ లోపలి కెళ్ళింది అక్కడ ఒక సోఫామీద కళ్ళు మూసుకుని పడుకుని వున్నాడు కామేశం.

"అయ్యో మామా ! ఏటయింది నీకు ! అయ్యో దేవుడో. నా మామని కాపాడరో దేవుడో_ బాబుగారూ...."

"డోన్ట్ వరీ సీతా !... నీ మామ ప్రాణాలను నేను రక్షిస్తాను....

"దండాలు బాబో దండాలు !"

"నో నో ! ఇవన్నీ దండగ.... నీ దగ్గర అన్ని సొగసు లుంచుకుని దండా లెడితే ఎలా చెప్పు....

"ఏమిటండి బాబయ్యా...." కర్టెన్ తొలగించి చూపాడు.... పెద్ద గది.. మధ్య మెత్తటి పరుపులున్న డబుల్ కాట్.. "అక్కడో అరగంట గడుపుదాం.... రా. నీ మావయ్యకు ఏమీ కాదు...."

"బాబూ. ధరమ ప్రభువులు.. మీ కిలాంటిది తగదు బాబూ !" మా మావయ్యని కాపాడండి బాబూ !"

"మీ మావయ్యకు సీరియస్గా వుంది : పెద్ద డాక్టరు రావాలి. చాల ఖరీదయిన ఇంజెక్షనివ్వాలి.. వంద రూపాయ లవుతుంది...."

"బాబూ ! మీ కాళ్ళట్టుకుంటా.. రక్షించండి_ "

"రక్షిస్తాను .... సీతా రక్షిస్తాను.... అందుకే పిలిపించాను.." అని ఆమె చుక్కల రవికమీద చేయి వేశాడు దేవదానం....

"బాబూ !" అని అరిచి అతడి చెంపమీద ఒక్కటి వేసింది సీత.

రెండు చేతులూ పట్టి లాక్కు- వెళ్ళాడు.

ఆ అర ఎకరా ఆవరణలో, ఆ మేడ లోపలి గదిలో ఆ సీత రోదన ఎవరికీ వినపడలేదు...

అర గంటయ్యాక ఆమె కూడా స్పృహ తప్పి పడిపోయింది.

కామేశానికి చూపినట్లే మత్తుమందు చల్లిన గుడ్డ ఆమెకు ముక్కు- దగ్గర పెట్టాడు దేవదానం.

మొదట . కష్టపడి కామేశాన్ని ఎత్తుకెళ్ళి కార్లో వేసుకుని ఆస్పత్రికి తీసుకెళ్ళి అడ్మిట్ చేయించాడు.

పది దాటాక, ఇంకా మత్తులో వున్న సీతను ఎత్తుకెళ్ళి కారు వెనక సీటులో వేసుకుని తీసుకుపోయి భీముని పట్నం రోడ్ మీద- జాగ్రత్తగా చూసి, వదలివేసి ఇంటికొచ్చాడు

ఆస్పత్రికి ఫోన్ చేశాడు-

"ఎలా వున్నారండీ! ఐ.సీ . బెటర్. రెస్పాండవుతున్నాడా?

గుడ్! పూర్ ఫెలో...బేబ్వే... నాదే ముందండీ.. వెల్ఫేర్ ఆఫీసర్గా నా డ్యూటీ.. ఓకే.. గుడ్ నైట్.. అతగాడి ఇంటి అడ్రసు సాయంకాలమే మీకిచ్చాను. నేను కబురు పంపాను...వుంటా గుడ్ నైట్ -

- శీలం వేరు ప్రాణం వేరు అని భావించే జాతికి చెందని దయిన సీత- అర్ధ రాత్రప్పుడు లేచింది. చుట్టూ చెట్లు. పైన నక్షత్రాలు... దూరంగా హోరు. మసకలు కమ్ముతుండగా, శరీరం మీద అసహ్యం వేస్తుండగా ఈడ్చుకుంటూ నడిచింది....

హోరు దగ్గరయింది..

"మామా! అని గావు కేక పెట్టింది.

అలసిన ఆమె శరీరాన్ని అలలు మోసుకెళ్ళాయి.

మరుసటి రోజుదయం-, దేవదానం గదిలోకి వచ్చాడు కామేశం ..

"ఒరేయ్! ఏదిరా! నా సీత! నా సీత ఏదిరా నక్కా- "

అని దేవదానం కాలర్ పుచ్చుకుని ఫెడీ ఫెడీమని కొట్టాడు.

ఈ లోగా ప్యూను, స్టెనోగ్రాఫరు వచ్చి కామేశాన్ని పట్టుకున్నారు. అదే సాయంకాలం ఆఫీసరును ఆఫీసులోనే కొట్టినందుకు కామేశాన్ని సస్పెండు చేశారు

పదిహేను రోజుల తర్వాత కామేశం ఇచ్చిన సంజాయిషీ చూశాక- అతడిని వుద్యోగంలో నుండి తీసేశారు।

– కామేశం గోడు గోడుమంటూ యూనియను ఆఫీసుకెళ్ళి అన్నీ వివరంగా చెప్పి– "మధుసూదనం బాబూ! నా కీలాగ అన్యాయమయిపోయింది నా పెళ్ళాన్నిలా చంపేశారు నా ఉద్యోగం తీసేసినారు. ఇప్పుడింక నా ఇద్దరు పిల్లలూ నేను ఎట్టా బతకాల!... ఈ అన్యాయం నుండి నువ్వే రక్షించాల బాబూ!" అని ఏడిచాడు.

"చూడు కామేశం! నువ్వు ఆఫీసుకు రమ్మంటే వెల్ఫేర్ ఆఫీసర్ ఇంటికెళ్ళి అడ్వాన్స్ కోసం నానా గొడవా చేశావు, మైకంలో పడిపోయావు. పాపం ఆ బాబు తన కారులో తీసుకెళ్ళి నిన్నాసుపత్రిలో చేర్పించాడు. ఆకలికి తట్టుకోలేక నీ పెళ్ళాం వెళ్ళి ఎక్కడో సముద్రంలో పడితే ఆఫీసులో కెళ్ళి ఆ బాబుని అందరి ముందు పట్టుకుని కొట్టావు. ఇన్ని వెధవ పనులు చేశాక నిన్నా వుద్యోగంలో ఎట్లా వుంచుకుంటారనుకున్నావు...."

"బాబూ! బాబూ! అదంతా అబద్ధం బాబూ! నేను వారింటికి ఆయన పిలిస్తేనే వెళ్ళాను. నా సీకతో బాపెళ్ళాను–"

"ఈ కథంతా నేనూ విన్నాన్లేవోయ్– కాని సాక్ష్యాలన్నీ నీవు చెప్పిందానికి వ్యతిరేకంగా వున్నాయి–"

"అన్యాయం బాబూ.. అన్యాయం. మీరే కాపాడాల బాబూ."

ఆలోచనలో పడ్డాడు మధుసూదనం లేచి ఇటూ అటూ తిరగసాగాడు. కాస్సేపయాక "చూడు కామేశం.... ఇది చాల కష్టమైన కేసు! చాల గట్టి ప్రయత్నమే చేయాలి.. అవసరం అయితే హైదరాబాదు వెళ్ళి లేబర్ కమీషనర్ గారితో మాట్లాడాలి! —" అన్నాడు....

"మీ దయ బాబూ! ఆ ఉద్యోగం ఇప్పించినారంటే మీ పేరు చెప్పుకుని కూడు తింటాను – "

"అంత సులభం కాదోయ్-ఉద్యోగం రావడం అంటే-దానికి డబ్బు ఖర్చవుతుంది...."

"డబ్బా బాబూ!"

"ఔను డబ్బే... వెయ్యి రూపాయలయినా అవుతుంది .."

"అయ్యో! వెయ్యి రూపాయలు నేనెక్కడి నుండి తేనురా దేవుడా... నన్ను. నా పిల్లల్ని అమ్మినా వెయ్యి రూపాయలు రావే..."

"అలాగంటే ఎలా కామేశం .."

"బాబూ! నాల్గు సంవత్సరాల నుండీ నెలకు మూడేసి రూపాయలు చందా కట్టించుకంటిరి కదా.. ఆ డబ్బుతోనే నా పని చేయించండి బాబూ!"

"ఓరి పిచ్చివాడా! ఈ యూనియనాఫీసు గదికి అద్దె, కుర్చీలు, టెలిఫోను, మన ప్రదర్శనలకు కావాల్సిన జెండాలు, మీటింగుల ఖర్చులు, మంత్రులు వచ్చినప్పుడు దండలు, అవీ, ఖర్చులు — ఇవన్నీ ఎక్కడినుంచి వస్తాయనుకుంటున్నావు... నేను పెళ్ళాం పిల్లల్ని వదలి మీ అందరికోసం కష్టపడ్డం కాకుండా ఈ ఖర్చులన్నీ నన్నే పెట్టుకోమంటావేమిటి —"

"నే నన్నది అది కాదు బాబూ!"

"మరింకేవిటోయ్... మీలాంటి వాళ్ళ కింతే. య్యా! ఆ వంతయినా విశ్వాసం వుండదు — మరి ఇంతేసి ఉదగ్గలిగిన వాడిని వెళ్ళి ఆ ఆఫీసరనో, చిన్న బాబు గారినే ఉదగ లేకపోయి నావా? అని కోపంగా అన్నాడు మధు...

"బాబ్బాబూ! మీరూ కోపగించుకుంటే ఇంక మాలాంటి వాళ్ళకు దిక్కేవిటి?"

"మరింకేవిటోయ్.. నెలకు రెండొందలొచ్చే వుద్యోగం మళ్ళీ వస్తే అయిదు నెలల్లో వచ్చేస్తుంది వెయ్యి రూపాయలు... వెధవ వెయ్యి దేముంది..."

"ఎలాగ బాబూ వెయ్యి తేవడం.."

"ఎవరి దగ్గరయినా తీసుకో...చూడు..."

"చూస్తా బాబూ! చూస్తా! భగవంతుడా!...."

ఒకసారి చంపేయి నాయనా.... చంపేయి" అనుకుంటూ వెళ్ళిపోయాడు కామేశం,

నవ్వుకున్నాడు మధుసూదనం.

కుర్చీలో నిలాసంగా జేరగిలబడి అలా చూచాడు హఠాత్తుగా అతడి చూపు పైకప్పు మీద ఒక మూల దట్టంగా అల్లుకుని వున్న సాలెగూడు మీద పడింది.

"బాయ్!"

వచ్చాడు. ఆ సాలెగూడుని కర్రతో తీసేశాడు.

మధు టెలిఫోన్ తీశాడు... "ఓషియన్ బ్యూటీ—" హోటల్‌కు ఫోన్ చేశాడు...

నెలాఖరున వస్తున్న తమ అఖిలభారత నాయకుడి గౌరవార్థం ఏర్పాటు చేస్తున్న డిన్నర్ వివరాలు మాట్లాడాడు. కామేశం గొడవంతా విన్న సూర్యం మండి పడ్డాడు. ఇక ఊరికే కూర్చుంటే లాభం లేదనుకున్నాడు. పూనుకుని ఏదన్నా చేయాలి అనుకున్నాడు. దగ్గర వారందరితోనూ సంప్రతింపులు జరిపాడు. అతడి అభిప్రాయాలను మెచ్చుకున్నారేగాని అచరణలో పెడదామనేసరికి అందరూ జంకసాగారు,

ఈ గొడవల్లో పడి తమ వెడ్డింగ్ యానివర్సరీనాడు సెలవు కూడా పెట్టలేక పోయాడు సూర్యం; అదీగాక దుర్గ ఆరోగ్యం కూడా సరిలేదు. విపరీతమైన కడుపునొప్పితో బాధపడసాగింది. పెద్ద లేడీ డాక్టరుకు చూపించి మందు ఇప్పించసాగాడు సూర్యం.

ఆఫీసు వ్యవహారాలలో పడి అతడు ఎక్కువగా వర్కర్లు, వాళ్ళ గొడవలు అవీ చూస్తున్నాడు.

దుర్గేమో- ఈ మందులవలన పెద్దగా గుణం కనపడటం లేదని బాధపడుతూంటే ఎదురింటి మామ్మగారు చెప్పారని శుక్రవారాలు వుండడం మొదలు పెట్టింది. కొన్నాళ్ళకు శనివారం రాత్రి ఉపవాసం మొదలు పెట్టింది

అఖిలభారత గార్మెంట్ ఎక్స్‌పోర్ట్ వర్కర్స్ యూనియన్ సెక్రటరీ జనరల్ నిఖిల్‌సేన్ విశాఖపట్నం వచ్చాడు.

సముద్రపు ఒడ్డున హోటల్ "ఓషియన్ బ్యూటీ—"లో

దిగాడు.

మధుసూదనరావ్ అధ్యక్షతను జరిగిన 'బ్రహ్మాండమైన' సభలో ఆయన వర్కర్లందరినీ వుద్దేశించి చాల ఉత్తేజకరంగా మాట్లాడాడు. చివర— "వ్యవస్థ మారాలి! కార్మికుడు రాజవ్వాలి! బోనస్ పెరగాలి! కార్మిక రాజ్యం రావాలి... అందుకోసం కార్మికు లందరూ ఐకమత్యంతో పోరాడాలి!" అని నినాదాలిచ్చాడు.

కార్మికులంతా ఉత్సాహంతో నినాదాలిచ్చారు.

'ఇంక్విలాబ్ జిందాబాద్' 'బోలో భారత్ మాతాకీ-జై!' 'వర్కర్స్ యూనిటీ జిందాబాద్-' 'నిఖిల్ బాబూ జిందాబాద్' 'మధుసూదనరావ్ జిందాబాద్!-'

సభానంతరం నిఖిల్‌సేన్ చుట్టు మూగారు వందలాది కార్మికులు.

'దారివ్వండి- దారివ్వండి-' అని దారి తీయగా నిఖిల్‌సేన్ కారు దగ్గర కొచ్చాడు. వెనకాలే మధుసూదనరావూ వచ్చాడు.

ఈ జనాన్ని అందరినీ తోసుకుని బాణంలా దూసుకు వచ్చాడు ఒక వ్యక్తి.

నిఖిల్‌సేన్ కాళ్లు పట్టుకున్నాడు... "బాబూ! రక్షించండి! నా కన్యాయం జరిగిపోయింది! నాకు యజమాని అన్యాయం చేశాడు! నా పెళ్ళాం సముద్రంలో పడి చచ్చింది.. నా దగ్గర వెయ్యి రూపాయలు తీసుకుని ఇదిగో వాడు.. అన్యాయం చేశాడు-

వాణ్ణడగండి బాబూ! వెయ్యి పుచ్చుకున్నాక కూడా నా వుద్యోగం ఎందుకు ఇప్పించలేదో అడగండి బాబూ-!"

ఆ సరికి తేరుకున్న వలంటీర్లు అతగాడిని బలవంతంగా లాక్కుని వెళ్ళిపోయారు.

కారులో కూచున్న నిఖిల్‌సేన్ అడిగాడు

ఇంగ్లీషులో, "మధూ! ఏమిటా గొడవ...?"

"వాడా! వాడో పిచ్చివాడు! ఎప్పుడూ ఇంతే! ఓ రూపాయో అర్ధో ఇస్తే వెళ్ళిపోతాడు-"అని నవ్వాడు మధుసూదనం.

ఆ రాత్రి నిఖిల్‌సేన్ గౌరవార్థం హోటల్ "ఓషియన్ బ్యూటీ"లో మధుసూదనరావ్ ఇచ్చిన డిన్నర్‌లో చినబాబుగారు, కలె

క్షరు గారు, ఎం ఎల్ ఏలు, స్పెషలాఫీసరు, మాజీ మంత్రిగారు. ప్రముఖ సంఘసేవకురాలు—వగైరా పెద్ద లందరూ పాల్గొన్నారు.

ఘనంగా రెండుగంటల సేపు జరిగిన
ఆ డిన్నరు ఫారిన్ విస్కీతో మొదలయింది....

ముదురెరుపు ద్రవాలు నిండిన గ్లాసులు క్లింగ్ మన్నాయి. పరస్పరం "హెల్త్" అనుకున్నారు.

"ఎక్కడిదింత మంచి సరుకు మధూ" అని అడిగాడ నిఖిల్.

పోర్టులో మన వాళ్ళున్నారు కదండీ! రేపు ఓ డజన్ తెప్పించి పెట్టిస్తాను—" అన్నాడు.

ఘుమఘుమలాడే వంటకాలతో కూరలతో, పుడ్డింగ్‌లతో. ప్రాన్ కర్రీలలో' ఐస్‌క్రీమ్‌లతో, ఆపిల్ పళ్ళలో మజాగా సాగింది డిన్నర్.

కేబరే కూడా చూచి అతిధులు ఇళ్ళకు చేరేసరికి—పన్నెండు దాటింది. కామేశం పిల్లలో ఒకడు ఆకలికి ఏనాడో చనిపోగా మిగిలిన ఒకడూ అదే హోటల్ వెనకాల, ఎంగిళ్ళు పారేసేచోట కూర్చొని ఆ పారేసే ముక్కలకోసం కుక్కలతో పోట్లాడి, దొరికింది తిని అక్కడే నిద్రపోసాగాడు.

మీటింగ్ దగ్గర అల్లరి చేసాడని చితక బాది పడేసిన కామేశాన్ని— ఎవరో చెప్పగా విని—ఆస్పత్రికి తీసుకెళ్ళిన సూర్యం—అతడి పక్కనే కూచున్నాడు. తోడుగా అప్పన్న వున్నాడు ఆ విషయం తెలియక, ఆరోగ్యం సరిలేక ఆందోళనతో ఎదురు చూస్తూ కూడుంది దుర్గ భగవంతుడికి పరిపరి విధాల మొక్కుకుంది

o o o

ఓనరుగారు ఆరు వారాల పాటు పారిస్, ఫ్రాంక్‌ఫర్డ్, రోమ్, న్యూయార్క్, టోక్యో నగరాలకు వ్యాపార పర్యటన మీద వెళ్ళారు. కొత్తకొత్త ఒప్పందాలుకుదుర్చుకున్నారు. విజయవంతంగా తిరిగివచ్చారు. వస్తూవస్తూ దారిలో అక్కడ ఢిల్లీలోను, ఇక్కడ హైదరాబాద్‌లోనూ ఆయా మంత్రిసత్తముల్ని కలుసుకునీ మరీ వచ్చారు,

మహాలక్ష్మి కంబైన్స్‌వారి గార్మెంట్స్ ఎగుమతి ఆరునెలల్లో

మూడు రెట్లు పెరగాలి. పెరిగితేగాని కొత్తగా కుదిరిన ఒప్పందాలకు దుస్తుల సరఫరా జరగదు అంచేత ఆ విభాగంలో పనిచేసే వారి సంఖ్య మరొక వంద ఇరవై దాకా పెంచారు. అయినా ఉత్పాదన పెరగడం లేదని తెలిసిన వెంటనే రెండు షిఫ్టులపని పద్ధతి ప్రవేశ పెట్టారు.

ఉదయం ఎనిమిది నుంచి మధ్యాహ్నం రెండింటి దాక ఒక షిఫ్ట్, మధ్యాహ్నం రెండింటి నుండి రాత్రి పదింటిదాక రెండవషిఫ్ట్. దీంతో దుస్తుల ఉత్పత్తి చకచక పెరిగింది. చినబాబుగారి గదిలోని గ్రాఫ్‌లో ఉత్పత్తి వుండవలసిన స్థితిని సూచించే ఆకు పచ్చగీతా, నిజంగా జరుగుతున్న ఉత్పత్తిని ప్రతిబింబించే ఎర్రగీతా దగ్గరవసాగాయి. అంతా సవ్యంగా సాగితే వచ్చే మార్చి నాటికి దుస్తులవిభాగం, పన్నులన్నీ చెల్లించాక, ఒక కోటి అయినా లాభాలు చూపెట్టాలి మెరైన్ ప్రోడక్ట్స్ డివిషన్ లాభాలు మూడు కోట్లు దాటాలి. మిగతా అన్నీ కలిపి ఎంత లేదన్నా ఇంకొక రెండు కోట్లురావాలి.

—అని తన ఊహలన్నీ చినబాబుగారు ఒక రాత్రి ఏకాంతంలో వుండగా, తన సతీమణి రమణమ్మా సుదర్శనప్రసాద్ గారంతో అనగానే ఆవిడ – "అయితే మనం వెంకటేశ్వరుడి చేతికి వజ్రాల తొడుగు ఒకటి చేయించాలి: మన గురువుగారి ఆశ్రమానికి ఒక లక్షయినా విరాళం ఇవ్వాలి" అన్నారు.

వజ్రాల తొడుగుకీ, లక్ష విరాళానికీ చినబాబుగారి కెట్టి అభ్యంతరమూ లేదు. కాని ఆ నవజీవనానందస్వామిని "మన" గురువుగా పేర్కొనడం నచ్చలేదు. కాని 'ఎట్ ఆల్ కాస్ట్స్' శాంతిని కోరేవారు గనుక ఆయన ఏమీ అనలేదు.

పైపెచ్చు ఆమెను తన కౌగిలిలో బంధించారు. మరింత దగ్గరగా హత్తు అన్నారు.

'ఏమిటీ విచిత్రం. ఏడాది తర్వాత మళ్ళీ ఇవాళ అయ్యగారి గాలి ఇటు మళ్ళింది' అనుకున్నారు రమణమ్మాజీ.

'ఎంతయినా ఫామిలీ లేడీ ఫామిలీ లేడీయే।' అనుకున్నారు చినబాబు.

'మల్లికార్జునరావ్ నిజంగా కృష్ణభగవానుడే.'

'షీలా అయితే ఇంకోలా రియాక్ట్ అవుతుంది'

ఈ విధంగా అక్కడ వున్నది ఇద్దరే అయినా నలుగు రయిదుగురు కలిసి ఆనందాలలో తేలియాడడం జరిగింది.

—చినబాబుగారు ఆదమరచి నిద్రపోతున్నారు: రమణమ్మ గారూనూ.

సరిగా ఆ సమయానికి మహాలక్ష్మి కంబైన్స్ గార్మెంటెక్స్పోర్ట్ విభాగంలో సీనియర్ కార్మికుడు పైడితల్లి రెండవ షిఫ్ట్ ముగించుకొని ఇంటికి బయలుదేరాడు. బస్సులు ఒంటిమించు బంద్ అయిపోవడంతో మూడు మైళ్ళవతల వున్న ఇంటికి నడక మొదలు పెట్టాడు.

ఆ వారం వారమంతా రెండవ షిఫ్ట్ చేసి అలసిన ఆ శరీరం అలా నడుస్తూ కాన్వెంట్ జంక్షన్ చేరి మలుపు తిరుగుతుండగా— ఒక పెద్ద కాంట్రాక్టర్ గారి లారీ ఒకటి అతివేగంగా వచ్చింది.

'అమ్మా' అన్నాడు పైడితల్లి.

మరుక్షణం స్వర్గంలో వున్న అమెను చేరుకున్నాడు.

లారీని తోలుతున్న పంజాబీ డ్రైవర్‌కు ఇది ఇలాటి ఆరవ కేస్ కావడంవల్ల, ఆ కప్పు మడుగులోకి 'సాలా!' అని కాండ్రించి వుమ్మేసి లారీని అరవై కిలోమీటర్ల వేగంతో నడుపు కుంటూ వెళ్ళిపోయాడు.

పైడితల్లి పెళ్ళాం మొత్తుకోళ్ళు విని, మధుసూధనరావు ఈ విషయాన్ని 'టేకప్' చేశాడు యాజమాన్యంతో చర్చలు జరిపాడు. ఆవిడకు రెండువేల రూపాయలు నష్టపరిహారం ఇప్పించాడు. ఆమె పదహారేళ్ళ కొడుక్కు ఏదయినా పని ఇప్పించమన్నాడు

కానీ .... "యు నో మధూ! ఎప్పుడేది ఎలా చేయాలో నాకు తెలుసు ఒక్కసారే అన్నీ ఇచ్చేయమంటే— ఈ స్థానంలో నువ్వున్నా సరే— ఇచ్చేస్తావా చెప్పు." అన్నాడు చినబాబు మంద హాసంతో

ప్రతిగా తానూ చిన్న నవ్వు నవ్వి— "ఎస్సార్! కార్మికులు గొడవచేస్తారేమోనని" అన్నాడు మధుసూధనరావ్.

"నో ప్రాబ్లెమ్! నువ్వున్నావు. ఆనక నేనున్నాను. తర్వాత

పోలీసుంది. అటు పిమ్మట స్టేట్‌లో, సెంటర్‌లో మనవాళ్ళున్నారు. వాట్?"

"ఎంత మాటండీ! అలాగే కానివ్వండి. సార్!"

"చెప్పు."

"నేను మనవి చేశాను. మా మేనల్లుడి అప్లికేషన్ విషయం..."

"ఓ ఎస్. ఓ ఎస్. తప్పకుండా చేద్దాము మల్లిక్!." అంటూ పి. ఎస్. ని పిలిచారు.

"నే వస్తానండీ."

బయటికి వెళుతూ మధుసూదనం, లోపలికి వస్తూ మల్లి కార్జునం ఒకరకొకరు ఎదురయ్యారు.

'నమస్కారమండీ:" అన్నాడు మల్లిక్.

మహారాజులా తల వూచాడు మధు. కేవలం ఒక గుమాస్తా అయిన తను బాస్‌గారి పి. ఎస్. వంగి దండాలు పెడుతున్నాడు! కార్మికవర్గం యొక్క బలం!

వారం రోజుల తర్వాత జరగనున్న వార్షిక సమావేశంలో పైడితల్లి భార్యకు రెండువేల రూపాయల చెక్ ఇవ్వడం జరుగు తుందని మధు ప్రకటించడంతో సభ్యులంతా చాల సంతో షించారు. 'నిజంగా మధుబాబే లేకపోతే... మనకి మాత్రం ఎవడిస్తాడురా' అని మురిసిపోయారు.

— రంగురంగు జెండాలతో, బేనర్లతో, మధ్య ఎత్తయిన వేదికతో, నాలుగు మూలల నాలుగు లౌడస్పీకర్లతో విరాజిల్లు తూంది సభాస్థలి. సభనిండా కార్మికులు బీడీలు తాగుతూ, ఉమ్మేస్తూ, కబుర్లు చెప్పుకుంటూ కూచ్చుని వున్నారు

అనుకున్నదానికన్నా అరగంట ఆలస్యంగా సభ ప్రారంభ మైంది

కార్యదర్శి మధుసూదనరావు అద్భుతంగా మాట్లాడాడు

"దేశంలో ప్రతి కార్మికుడికి తిండి, బట్ట ఇల్లు అన్నవి ప్రాథమిక మైన హక్కులు. ఆ హక్కులన్నీ సాధించేదాక మనం నిద్రపోరాదు, మన శ్రమతోనే, మన రక్తంతోనే, మన చెమటలోనే

దేశం నడుస్తున్నది. ఈ నాడు పొలంలో పంటలు అమితంగా పండుతున్నాయి అన్నా. ఫ్యాక్టరీలలో వస్తువులు అధికంగా ఉత్పత్తి అవుతున్నాయి అన్నా ఇదంతా మన శ్రమవల్లనే అని మరవరాదు. అది మరిచిననాడు మనల్ని మనమే మరిచినట్లవుతుంది.

"స్వాతంత్ర్యం వచ్చినప్పుడు దేశంలో ప్రతి ఒక్క దరిద్ర నారాయణుడి కంటి నీటినీ తుడవాల అని గాంధీజీ చెప్పాడు. కాని గాంధీజీ అనుచరులం అని చెప్పుకుంటున్న ఈ వందలాదినాయకులూ మనకు చేసింది ఏమిటి! అరవై కోట్ల వారు అరువందలకోట్లకు అధిపతులయ్యారు, యాభై కోట్ల వాళ్ళు ఎనిమిది వందల కోట్లకు పెరిగారు. కాని బక్కచిక్కిన బడుగు కార్మికుడు, మన సోదరుడు, మన కామ్రేడ్ ఏమయ్యాడు.... అతడికి ఒకపూట గంజికి కరవవుతోంది-(చప్పట్లు)

"ఈ పరిస్థితి ఇక ముందు సాగ డానికి వీలులేదని నేను మీ అందరి తరపున ప్రభుత్వాన్ని యాజమాన్యాల్ని హెచ్చరిస్తున్నాను- మన కంపెనీ లాభాలు ఏటకేడాది పెరుగుతున్నాయి. కాని మనకార్మికుల పరిస్థితిలో ఏమంత అభివృద్ధి కనపడ్డం లేదు. మన అలవెన్సులు పెరగాలి. మనకు ఏటా ఇంకో యాభై వారం ఇవ్వాలి. యాజమాన్యం వారితో ఈ విషయమై మన యూనియన్ సంప్రదింపులు జరుపుతుంది; అవసరం అయితే పోరాటానికి సిద్ధమవుతుంది- అందులో సందేహం ఏమీలేదు! (కరతాళ ధ్వనులు)

"మన యూనియన్ గత కొన్ని సంవత్సరాలుగా కార్మికుల కోసం ఎంత పాటుపడిందో మీకు తెలియంది కాదు. అయినా కొందరు స్వార్థపరులు, యాజమాన్యపు తొత్తులు మనకు దూరం అయి, మనకు వ్యతిరేకంగా పనిచేస్తున్నారు. అలాటి శక్తులు నానాటికీ పెరగడం చాల శోచనీయమయిన విషయం. అయినా మీ అందరి అండదండలతో ఈ కార్మికోద్యమ తిరోగమన శక్తులమీద చావుదెబ్బ తీసి తీరుతాము. (పెద్దగా హర్షధ్వానాలు)

"మన పోరాట చరిత్రలో మరొక్క పెద్ద మైలురాయి- ఇటీవల ప్రమాదానికి గురయి అకాల మరణం చెందిన సోదర కార్మికుడు పైడితల్లి యొక్క భార్యకు ఇవాళ రెండువేల రూపా

యల పరిహారం చెల్లించడం- ఆ మొత్తాన్ని పైడితల్లి భార్యకు మన గౌరవ అధ్యక్షులు వెంకటసుబ్బయ్యగా రందజేస్తారు- పైడితల్లి కొడుక్కు- ఇక్కడ ఉద్యోగం ఇప్పించడానికి కూడా ప్రయత్నం చేస్తున్నాము" అని కూర్చున్నాడు.

'కార్మిక సంఘం జిందాబాద్—

మధుసూదనంబాబు జిందాబాద్ -'

అని కేకలు మిన్నుముట్టాయి.

వేదిక మీదకు వచ్చి పైడితల్లి భార్య ఆ డబ్బున్న కవర్‌ను అందుకుంది దండం పెట్టి వెళ్ళి పోయింది.

ఆమె అటునుండి దిగుతుండగా-ఇటునుండి వేదికమీదకు సూర్యం వచ్చాడు హఠాత్తుగా.

"అధ్యక్షుల వారి అనుమతితో-" అని సుబ్బయ్య గారివైపు చూచి, ఆయన తల వూచగానే-"మైకు ముందు కొచ్చి-" క్షమించండి కార్మిక సోదరులకు రెండు మాటలు చెప్పదలచు కున్నాను-" అన్నాడు.

"నో-నో!"అని అరిచాడు మధుసూదనరావ్. అతడు లేవ బోతుండగా అధ్యక్షులు ఆపారు.

"వీల్లేదు...దిగాలి..వద్దు." అని సభలో కొందరు అరిచారు.

"మాట్లాడాలి! మాట్లాడాలి!" అని మరికొందరు లేచారు. కలవరం బయలుదేరింది,

చేతులు జోడించి-సూర్యం "సోదరులారా! దయచేసి -నా మాటలు ఒక అయిదు నిముషాల పాటు వినవలసిందిగా వినయ పూర్వకంగా కోరు తున్నాను"

"విందాం విందాం!"

మధుసూదనరావ్ మళ్ళీ లేచారు..

"ఇది కార్మికుల సభ-ఇక్కడ లిస్టులో వున్న వారు తప్ప ఇంకెవరూ మాట్లాడ రాదు-అని అరిచాడు-"

"సూర్యం గారిని విందాం! వింటాం.."అన్న కేకలు ఎక్కువగా విన్పించాయి —

మధుసూదనం వెనక్కి-తగ్గాడు

సూర్యం మొదలు పెట్టాడు.

"పూజ్యులు వెంకటసుబ్బయ్యగారికి, ప్రముఖ కార్మిక నాయకులు మధుసూదనరావుగారికి. కార్మిక సోదరులకు నా నమస్కారాలు

"ప్రమాదానికి గురి అయి మరణించిన మన ప్రియతమ సోదరుడు పైడితల్లి జ్ఞాపక సూచకంగా మనమంతా ఒక్క నిముషం-మౌనంగా నిలబడదాం" అన్నాడు.

అందరూ నిలబడ్డారు.

మధుసూదనానికి చిరాకుగా వుంది.

కూచున్నారు.

"మీలో ఒకడుగా నేను కొన్ని మాటలు చెబుతాను వినండి. విని ఆలోచించండి నా మాటల్లో తప్పుంటే క్షమించండి నన్ను దిద్దండి. మనందరిదీ ఒక కుటుంబం. ఒక జాతి. మనలో మనకు ఎటువంటి భేదాలూ రాకూడదు మనం ఇలా కలిసికట్టుగా వుంటేనే పోరాడగలం; బాగు పడగలం.

"ఇపుడు పైడితల్లి విషయమే తీసుకోండి. అతడి భార్యకివాళ రెండువేల రూపాయలు అందజేశారు. ఆ డబ్బు ఆవిడకు సాయంగా వుంటుంది. అది సాధించిన నాయకుడు మధుసూదనం గారిని మనసారా అభినందిస్తున్నాను. (చప్పట్లు)

అయితే- ఈ విషయాన్ని మరి కొంత లోతుగా వెళ్ళి పరిశీలించమని నేనుఅందరినీకోరుతున్నాను పైడితల్లి ఆరాత్రి ఎందువల్ల మరణించాడు? రెండవ షిఫ్ట్‌చేసి అలసిన పైడితల్లి అరాత్రి పన్నెండింటికి నడిచి వెళుతున్నాడు, లారీప్రమాదానికి గురై మరణించాడు. అసలు ఈఫేక్టరీలో రెండవషిఫ్ట్ ఎందుకువచ్చింది? ఎక్కువదుసులు తయారు చేయాలి, ఎక్కువగా డబ్బు ఆర్జించాలి అన్న వుద్దేశం కోసం రెండో షిఫ్ట్ వచ్చింది. మరి రెండింతలుత్పత్తి పెరిగింది కంపెనీకి రెండింతలు ఎక్కువ లాభం వస్తుంది. అందుకోసం పైడితల్లి మరణించాడు!

- కనుక రెండవ షిఫ్ట్ పనిచేసిన కార్మికులను ఇంటి దగ్గర దిగబెట్టడానికి కంపెనీవారు బస్సు ఏర్పాటు చేయాలి. అలాంటి

ఏర్పాటే వుంటే పైడితల్లి చచ్చి వుండేవాడు కాదు. ఇంకా కొందరు ఈ విధంగా చావకముందే రెండవ షిఫ్ట్ కార్మికులు రాత్రి వేళ ఇళ్ళు చేరడానికి ఉచిత బస్ సౌకర్యం ఏర్పాటు చెయ్యాలి అని మనం డిమాండ్ చేయాలి. అదనంగా ఇంకో కోటి రూపాయల లాభం పొందబోతున్న కంపెనీ వారీ విధంగా కార్మికులకు ఓ లక్షో రెండు లక్షలో ఖర్చు చేయడం- పెద్ద మెహర్బానీ ఏమీ కాదు- ("సెభాష్! సెభాష్!")

"ఇంక తర్వాతి అంశం.. పైడితల్లి అనే కార్మికుడు మరణించాడు గనుక అతడి కొడుక్కు వుద్యోగం ఇవ్వాలి అని కోరుతున్నాము. యాజమాన్యం పరిశీలిస్తున్నది బహుశ వుద్యోగం ఇవ్వ వచ్చు కూడా. ఈ మాత్రం దానికి మనం పొంగిపోతున్నాము. ఇక్కడ కూడ మరి కొంచెం లోతుకు వెళ్ళి ఆలోచించండి. పైడితల్లి కొడుకు- ఇప్పుడు పదహారేళ్ళు, వాడు ఎనిమిదో తరగతో, తొమ్మిదో తరగతో చదువుతున్నాడు. పదవ తరగతయినా పాసవందే వాడికి గుమాస్తా వుద్యోగమయినా రాదు. అందులోనూ ఇప్పట్లో వయసు చాలదు గనుక వాడిని ఏ ఆఫీసు బాయ్‌గానో, బంగళా దగ్గర నౌకరుగానో వేసి నెలకు ఏ ఎనభైయ్యో తొంభయ్యో ఇచ్చేసరికి, ఏదో జీవనాధారం దొరికింది కదా వాళ్ళ కుటుంబానికి- అని మనం మురిసి పోతున్నాం. ఇంక నాల్గేళ్ళకు ఆ అబ్బాయికి పెళ్ళవుతుంది అప్పుడు వాడికీ వంద చాలదు. ఇద్దరు పిల్లలు పుడతారు. మరో పాతిక జీతంతో వాళ్ళ నల్గురికీ ఒక పూట తిండి కూడా రాదు. ఎప్పుడెపుడు పిల్లలు కాస్త పెద్ద వాళ్ళవుతారా, వాళ్ళకే బాబు కాళ్ళయినా పట్టుకొని నెలకో పాతికో పరకో ఇప్పించే వుద్యోగంలో వేద్దామా అని పైడితల్లి కొడుకు అనుకుంటాడు. అంటే ఏమిటన్న మాట? పైడితల్లి కార్మికుడు! అతడి కొడుకు ఆఫీసుబాయ్! ఆఫీసుబాయ్ కొడుకు ముష్టి వెధవ- అవుతున్నాడు! ఇది అభ్యుదయమా? ఇది కార్మికుల నుద్ధరించడమా? వారిని బాగు పరచడమా? ("కాదు - కాదు" అని కేకలు)

"పైడితల్లి కార్మికుడయితే అతడి కొడుకు మేస్త్రీ అవాలి; మేస్త్రీ కొడుకు ఇంజనీరవాలి అదీ అభివృద్ధి అంటే.. అంతేకాని

నెలకో అయిదు రూపాయల ముష్టి అలవెన్సులు- సంవత్సరానికీ ఇంకో కాకీలాగు, చొక్కా తెచ్చుకోవడం కాదు.. పాతికేళ్ళ సర్వీసు చేసిన కార్మికుడు ప్రమాదంలో చచ్చిపోతే వాడి పెళ్ళాం మొహాన రెండు వేల రూపాయలు పారేయడం గొప్ప ముందడగు కాదు. ఈ అన్యాయాన్ని కార్మికులు తెలుసుకోవాలి. కార్మికులు కలకాలం కార్మికులుగానే వుండిపోయే పరిస్థితి మారిపోవాలి అందుకు తగిన మార్పులు తేవాలి ఉదాహరణకు పెద్దితల్లి కొడుకు ఎంతవరకు చదివితే అంతవరకు చదివించే బాధ్యతను కంపెనీ యాజమాన్యం స్వీకరించాలి- ("ఔను! ఔను!")

"చచ్చిపోయిన కార్మికుల పిల్లలు చదువే కాదు పనిచేస్తున్న కార్మికులందరి పిల్లల పై చదువుల బాధ్యతలను కంపెనీ స్వీకరించాలి. ఇందు నిమిత్తం ఒక అయిదారు లక్షల రూపాయలతో ''విద్యానిధి" నేర్పరచాలి. ఆ మొత్తం మీద వచ్చే వడ్డీతో మన పిల్లల పై చదువులకు సౌకర్యం కల్గించాలి (''ఔను! కల్పించాలి!")

"కార్మికుడు మరణించినా, రిటైరయినా ఇప్పుడు కంపెనీ వారిచ్చే మొత్తం—— పెరగాలి. ఈ విషయంలో మనం కంపెనీ వారి మీదే ఆధారపడ్డం కనుక మన స్వంత ప్రయత్నం కూడా చేయాలి. మనం అందరము నెల నెలా అయిదేసి రూపాయల చొప్పున చందా వేసుకోవాలి. అందులోంచి కార్మికులకు లేక వారి కుటుంబాలకు మనమే తక్షణం సాయం కల్పించాలి.
ఇలాగే కార్మికులకు ప్రమాదాలు జరక్కుండా ఇన్సూరెన్స్ చేయించాలి. వారి విజ్ఞానం పెరగడానికి పఠనాలయం పెట్టాలి, చదువు రాని వాంకోసం వయోజన విద్యా తరగతి లారంభించాలి ఈ విధమైన పనులు చేస్తూ- ఇంకొక వైపు యాజమాన్యపు నిరంకుశ ధోరణులను నిజాయితీతో ఎదుర్కోవాలి

''మనకు ఉద్యోగాలిచ్చిన యాజమాన్యంపట్ల మనకు విరోధ భావం ఏమీ లేదు. వారితో సహకరించడం మన విధి. అయితే వారి లాభాలు పెరుగుతున్నప్పుడు, అందులోంచి కార్మికులకు ఇంకా ఇంకా వసతులు రావాలి. యజమానులు కదా అని అన్యాయంగా మన భుజాల మీదెక్కి కూచుంటామంటే ఒప్పుకునేది లేదు. యాజ

మానానికి కార్మికులకు మధ్యవున్న స్వార్థపరులను సహించేది లేదు ఏ కార్మికుడినీ పతిపక్ష నిర్దయంగా తీసిలేయడానికి వీలులేదు అని మనం హెచ్చరించాలి. అలాంటి 18 వ శతాబ్దపు విధానాల నవలంబిస్తే కార్మికులు ప్రభుత్వం జోక్యంకోసం పోరాడాలి.

"శాంతితో సహజీవనానికి యత్నిస్తాం. నానాటికి కార్మికుడు పైకి వచ్చి ఇంకో రెండు తరాల తర్వాత కార్మికుడు, యజమాని అనే తేడాలేని వ్యవస్థ రావడానికి కృషిచేద్దాం, ఇది తెలుసు కోకుండా నియతృత్వం, దౌష్ట్యం చేపట్టిందో అటువంటి యజమాన్యం ఎంతో కాలం నిలవలేదు అని ఋజువు చేద్దాం. శెలవు." అని వేదిక దిగిపోయాడు సూర్యం.

అయిదు నిమిషాల సేపు.... "సూర్యం బాబు జిందాబాద్!" అన్న కేకలు, చప్పట్లు కోలాహలంగా వినపడ్డాయి.

పళ్ళు పట పటమని కొరికినా, మధుసూదనరావు పైకి మాత్రం సూర్యానికి నవ్వుతూ షేక్ హేండిచ్చాడు.

'ఇన్నాళ్ళ మన కిలాగ ఎవరూ చెప్పలేదే....'

'మనం ఎంత పాతకాలం ఆలోచనల్లో వుండి పోదాము'

'నిజమే! నేను వర్కరయితే నా కొడుకు నా కన్న ఎక్కువ్వాలి గాని వాడు వర్కరెందు కావాల?'

'సూర్యం బాబు మన లీడరయితే బాగుంటును' అని చాలమంది కార్మికులు అనుకుంటూ వెళ్ళిపోయారు

"ఇసోఫ్! పెద్ద మొనగాడొచ్చాడురో ఇవాళికి.... ఇన్నాళ్ళు పని చేసిన వాళ్ళకివన్నీ తెలియదు కావాల....రంగంలోకి దిగి చేస్తే తెలుస్తుంది.... మాటలతో అనపకాయలవేమిటి గుమ్మడి కాయలైనా కోసేయ్యొచ్చు.... పది సంవత్సరాల నుండి పెద్దోళ్ళందరినీ తెలిసిన పద్ధు చానెకోం.... ఇంకా వచ్చి రెండేళ్ళు కాలేదు క్యారోడెక్కడ—" అన్నవాళ్ళు లేక పోలేదు....

అప్పన్న. కామేశం, లాంటి వర్కర్లు, శ్రీపతి ప్రఫుల్లోసేన్ లాంటి ఆఫీసర్లు — ఈ కొత్త పరిమాణానికి మనసారా స్వాగతం పలికారు,

"ముందుగా ఇదేదో తెల్సుకోవాలి. మొక్కలోనే తుంచక

ళ పోతేని మానయి పోగలదు ! —" అని నిర్ణయించు కున్నాడు మధుసూదనరావ్.

కబు రందగానే కళ్ళేగర వేశాడు చిన బాబుగారు.

"దారి కనబడింది; నడిచే శక్తి నడిపించే శక్తి కావాలా" అనుకున్నాడు సూర్యం.

నగిషీలు చెక్కిన సింహాసనంలా వున్న కుర్చీ, దాని మీద మెత్తటి పరుపుల్లాటి దిండ్లు వాటి మీద కూర్చుని వున్న — శివజీవ నంద స్వామి ! వారి పాదాల దగ్గర పీట : దాని మీద దిండు మీద వెల్వెట్టు మీద వారి పాద కమలాలు

పాదాల దగ్గర క్రింద నేలమీద పెద్ద వెండి పళ్ళెం మీద పూలు, పండ్లు, కొబ్బరి చిప్పలు, అగరొత్తులు, కుంకుమ.

దబ్బ పండులాటి శరీరం. కోడి గుడ్డు లాంటి మొహం. చూచే వారిని ఆకర్షించే నిశితమైన కళ్ళు. వల్లగా ఒత్తుగా గిరిజాలు గడ్డం. ముఖాన విబూది రేఖలు, కుంకుమ బొట్టు

ఆ హాలు నిండా కిక్కిరిసి వందమంది ఆడు మగాల ఆహాహాలు. భక్తి పారవశ్యమత్తులై కూచుని వున్నారు.

పట్టు చీరలు, జరీ కండువాలు, దవ్వాల ఉద్దుసు, ఫాంస్ ఆటోమేటిక్ వాచీలు.

ఎంత లేదన్నా ఆ హాల్లో వున్న వస్తు సంపద యొక్క మూల్యం లక్ష రూపాయలకన్న తక్కువ వుండదు. ఏతద్ రీత్యా చూస్తే భక్తి అనేది చాల ఖరీదయిన వస్తువు అన్పించక మానదు, ఆ గదిలో భగవంతులున్నాడో లేదో కాని ధనానికి అది దేవత అని చెప్పబడే లక్ష్మీదేవి మాత్రం దగద్దగాయ మానంగా వెలిగిపోతూంది,

భక్తులొక్కొక్కరే వచ్చి సాష్టాంగ దండ ప్రణమాలు చేసి వెళ్తున్నారు.

స్వామీజీ కొందరిని చిరునవ్వుతో పలకరిస్తారు. కొందరి తలమీద చేయి వుంచి ఆశీర్వదిస్తారు. కొందరిని చూచి ఏమీ అనరు, వెళ్ళారు. కొందరి కయితే నోసట కుంకుమ దిద్దుతారు మరి కొందరికి ఓ అరటి పండో, కొబ్బరి చిప్పో ఇస్తారు, అవన్నీ వారి వారి పూర్వ జన్మసుకృతం—అనుకుంటారు భక్తాళి

భక్తులు స్వామీజీ గురించి, భగవల్లీలల గురించి మంద మందంగా మాట్లాడుకుంటున్నారు. హాలంతా కలకలంగా వుంది.

ఉన్నట్లుండి స్వామీజీ కుడిచేతిని పైకెత్తారు. అభ్భే! అందు లోంచి ఏదో రాల్చాలని కాదు, శిష్యకోటిని నిశ్శబ్దంగా వుండమని, అంతే! సద్దు అణిగింది

"యా నిశాం సర్వ భూతానాం,
తస్యాం జాగర్తి సంయమీ
యాస్యాం జాగ్రతి భూతాని
సానిశాపశ్యతో మునేః" !

గంభీరమైన కంఠం. స్పష్టమైన ఉచ్చారణ.

ఆ గీతా శ్లోకాని కొన్ని మళ్ళీ రాగయుక్తంగా చదివేసరికి హాల్లో అందరూ హిప్నటైజ్ అయినట్లుగా కూచున్నారు ఒక్కడు తప్ప.

ఆ ఒక్కడూ సూర్యం. తనకు బొత్తిగా ఇష్టం లేకపోయినా దుర్గ బలవంతం కొద్దీ ఆమె వెంట వచ్చాడు. ఆమె ఆరోగ్యం-ఎన్ని మందులు తీసుకున్నా - అంతంత మాత్రంగానే వుంటూంది. పెళ్ళయి మూడేళ్ళయినా వారింట పాపాయి వెలిసే సూచన లేక పోవడంతో దుర్గకి పూజాలూ భక్తులూ ఎక్కువయ్యాయి. ఈ స్వామీజీ వచ్చినప్పటి నుండి ఆమె కోరగా, పోరగా సూర్యం ఇవాళ ఆమె వెంట వచ్చాడు. అనాసక్తంగా అన్నీ పరిశీలిస్తున్నాడు: అలాగే విన్నాడు ఆ శ్లోకాని....

స్వామీజీ కంఠం ప్రతి ధ్వనించింది.

"భూత జాలములన్నిటికి ఏది రాత్రియో అది జితేంద్రియు డగు యోగికి పట్టపగలు; సమస్త భూతములకు ఏది పగలో అది విజ్ఞుడగు ద్రష్టకు రాత్రి."

అని ఆయాన అన్న మాటలు; "అందరికి ఏది రాత్రో అది దొంగలకు దొంగ నోట్లు అచ్చువేసే వాళ్ళకు, నల్లబజారు బ్రహ్మ లకు పట్టపగలు; ఈ విధంగా రాత్రంతా కష్టపడతారు గనుక సామాన్యులకు ఏదయితే పగలో అది పై జాతులవారికి రాత్రి -' అన్నట్లుగా విన్పించింది సూర్యానికి.

"అజ్ఞానాంధకారములో నుండు జీవుడుకు ఆత్మానుభూతి లేనందున వారు ఆత్మ విషయమున నిద్రించుచుందురు. స్థితప్రజ్ఞుడయిన యోగి ఆత్మ విషయములో మెలకువగా వుండును; ప్రాపంచిక విషయమై నిద్రావస్థలో వుండును. సామాన్యులు ప్రపంచ విషయమై మెలకువగా నుందురు." అని నవజీవనానంద వ్యాఖ్యానం చేశారు.

యూనివర్సిటీ తెలుగు టెక్స్ట్ బుక్ చదువుతున్నట్లనిపించింది సూర్యానికి.

'ఈయన దొంగస్వామీజీ కాదనే అనుకుందాము. మంచివాడే అనుకుందాము. ఈయన చెప్పే ఈ ఆత్మ, అనుభూతి, యోగం, జితేంద్రియత్వం - ఇవన్నీ ఎవరికి? పూటకింత గతి లేనివాడికా? అన్యాయంగా ఉద్యోగం పోగొట్టుకున్న కామేశానికా? కాలే కడుపుకు కావాల్సింది గంజి; కరిగించడానికి కండలున్నవాడికి అవసరమైంది చేతులనిండా పని; ఆ పనికి సరిపడే జీతం: అంతేకాని ఈ మతాల ఏర్ కండిషనింగ్ కార్మికుడి చెమట నార్చలేదు; వాడి ఆకలి తీర్చలేదు.

'ఎలాగో ఓలాగు డబ్బు చేర్చి, బోలెడంత తీరిక వున్నవాడికయితే ఇట్లా హాయిగా అగరొత్తుల ధూపం మత్తులో, ఫ్యాన్ల చల్లదనాల్లో కూచుని ప్రవచనాలు వినడానికి, శుష్క వేదాంత చర్చలు చేస్తూ "చీకటిగదిలోలేని నల్లపిల్లికోసం వెతకడానికి" వ్యవధి వుంటుంది: స్వామీజీల చుట్టూ ప్రదక్షిణాలు చేయడానికి సమయం వుంటుంది. అప్పన్నలకూ, పైడితల్లులకూ రోగం వస్తే ఆస్పత్రికి వెళ్లడానికే తీరిక వుండదు ఆశ్రమాల ఊసు వాళ్లకేల— ఈ తరహా మతం రిచ్ మాన్స్ లగ్జరీ! చారకు చింతపండు లేనివానికేల కోల్డు స్టోరేజ్‌లోని ఆపిల్ పండు.'

అని ఆలోచిస్తున్న సూర్యం స్వామీజీని వినలేదు. అందరూ గట్టిగా భజన ప్రారంభించడంతో ఉలిక్కిపడ్డాడు. దుర్గ కూడా తన్మయత్వంతో పాడుతోంది.

భజన అయింది. ఒక్కొక్కరే వెళ్ళి దండంపెట్టి ఆశీర్వచనం తీసుకుంటున్నారు. దుర్గ లేచింది. సూర్యంవైపు చూసింది.

అతడు తల అడ్డంగా ఊపాడు. ఆమె మాత్రం వెళ్ళింది.

దండం పెట్టింది. స్వామీజీ ఏదో అన్నారామెతో. చేతిలో అరటి పండు పెట్టారు.

సంతోషం నిండిన వదనంతో ఆమె వెనక్కొచ్చింది.

"ఆయన నీతో ఏమిటి అన్నాడు?" అని అడిగాడు సూర్యం.

'నీకు చెప్పను—' అని మారాం చేస్తున్నట్లు ముంగమూతి పెట్టింది దుర్గ.

ముచ్చటేసింది సూర్యానికి.

వారిద్దరూ వచ్చేస్తూంటే వీధిలో 'ఇంపాలా' కారాగింది. డ్రైవరు తలుపు తీయగా కారు నుండి భార్యాభర్తలు దిగారు.

సూర్యం— "అదుగో! అతడే చినబాబు అనబడే సుదర్శన ప్రసాద్!" అని దుర్గ చెవిలో ఊదాడు.

చినబాబు సూర్యాన్ని చూశాడా? ఏమో — సూర్యానికి తెలియదు.... కాని బయటికి వస్తున్న ఆ గుంపులో— అకౌంట్స్ ఆఫీసర్ శ్రీపతిగారు కన్పించారు. ఆయనకు నమస్కారం చేశాడు.

దుర్గకు చూపించాడు. ఆమె కూడా నమస్కారం చేసింది.

"మా ఇల్లు పక్క వీధిలోనేనండి" అన్నాడు సూర్యం.

"మా ఇంటికి రండి బాబాయిగారూ!" అంది దుర్గ.

ఆ అమ్మాయి మొహంలో నైర్మల్యమూ, ఆ పిలుపులో ఆప్యాయతా శ్రీపతినిట్టే ఆకట్టుకున్నాయి. ఆయన కాదనలేకపోయారు. నడవసాగారు.

"మా అమ్మాయి నీరజా....నాలాగే నమ్మా....ఎంత కొత్త వారినయినా ఇట్టే పరిచయం చేసేసుకుంటుంది_ఇప్పుడు అల్లుడితో బాటు స్టేట్స్‌లో వుంటూంది. ఇద్దరు పిల్లలు. ఇద్దరూ అమ్మాయిలే అన్నట్లు సూర్యం....మీకెంత మంది పిల్లలు_?"

"ఒక్కమ్మాయండి!

దుర్గ ఆశ్చర్యంగా చూచింది.

"దుర్గ అని అదిగో ఆవిడేనండి!"ఫకాలున నవ్వారు శ్రీపతి.

తర్వాత చెప్తా మీపని_అన్నట్లుగా చూసింది దుర్గ సూర్యాన్ని.

సూర్యం అన్నాడు: "మా ఆవిడకదేకొరతండీ! దానికితోడు ఉపవాసాలు, వ్రతాలూ ఎక్కువయ్యాయేమో ఆరోగ్యంపాడైంది"

"అవేం లేదండీ బాబాయిగారూ! ఇల్లన్నాక ఓదేవుడూ, పూజా. శుక్రవారం శనివారం—అని వుండవండీ—? ఈయనదంతా నాస్తికవాదం!"

"నాస్తికుడివయితే స్వామీజీ దగ్గర కెందుకొచ్చావు?" అని అడిగారు శ్రీపతి.

"ఇదుగో ఈ సాధ్వీమణి చేపట్టిన పుణ్యానికి—" అన్నాడు సూర్యం.

"అబ్బ! అక్కడికి పక్కవీధి దాక తోడు రావడంలోనే అలసి పోయినట్టు."

వారిద్దరి కలహమూ శ్రీపతిగారికి చూడ ముచ్చటేసింది.

ఇల్లు చేరారు.

చీకటి పడ్డంతో లైటు వేసింది దుర్గ

మగాళ్ళిద్దరూ వరండాలో కూచున్నారు.

"ఏమోనండి! మనుషుల్లో ఇంత అజ్ఞానం, అవినీతి, వంచన కుళ్ళు పేరుకునివుండగా మతం, భక్తి, దేవుడు— అంటూ సోమరి తనంగా కాలక్షేపం చేయడం తప్పనిపిస్తోంది నాకు. అంతేకాదు ఎవడెంత తన్నినా అంతా నావిధి అనే పలాయన వాదం, పిరికితనం నల్లమందు తత్వం—పెంచుతున్నాయి ఇవన్నీ—" అన్నాడుసూర్యం.

"సూర్యం! నువ్వు చెప్పిన వాటిలో చాల భాగం నిజమే? కాని కొన్ని నిజాల ఆధారంగా కొన్ని తప్పయిన నిర్ణయాలకు రాకూడదు—" అన్నాడు శ్రీపతి.

అంటే!

"అంటే—మనిషిలో ఈనాడు ధన వ్యామోహం, పదవీ వ్యామోహం పెరిగింది. ఆ కారణంగా అతడు చేయని తప్పుల్లేవు. కాని ఒకప్పుడు —ఒకప్పుడంటే ఎప్పుడో కాదు— మూడువందల సంవత్సరాల క్రింద వరకూ ఈ దేశం 'అసత్యం, అంటే ఏమిటో ఎరగదు. ఆ మాట చెబుతూ కల్నల్ జేమ్స్ టాడ్ అన్న చరిత్ర కారుడు—" అప్పుడు ఇండియాలో వ్యాపారం, బ్యాంకింగ్, లావా

దేవీలు అన్నీ నోటి మాట మీదుగా జరిగేవి. ఏ ఒక్క దానికీ వ్రాత పూర్వకమైన ఒప్పందం అనేదే వుండేదికాదు. మాట తప్పడం అనేది ఎరగరు ఆనాటి భారతీయులు - సత్యసంధత అనేది భారత దేశానికే ప్రత్యేకమైన గుణం' అని వేనోళ్ళ పొగిడాడు. అలాటి జాతి నేడు నీతికి దూరం అయింది. ఏ విద్య తీసుకున్నా, ఏ వృత్తి తీసుకున్నా కుర్చీ, కాంత, కనకం-ఇవే లక్ష్యాలయి పోయాయి. జీవితమే ఒక వ్యాపార మయింది. అంతేకాని మతం ఇందులో చేసింది ఏమీ లేదు. మతం అబద్ధం చెప్పమందా? భక్తి ఇంకోడిని దోచుకోమందా?

"ఈ కులాలు మతాలు-పోతే తప్ప ఈ దేశం బాగుపడదు. అవి మన కళ్ళను కప్పేస్తున్నాయి-"

"కులాలు అనేవి మతంకాదు: వాటిని సమూలంగా నాశనం చేయాలి. దొంగ బాబాలూ, పిల్లల్ని కనే "అమ్మలూ"—ఇలాటి వాళ్ళని వదిలేయి- అదిమతంకాదు.

దుర్గ రెండు గ్లాసులనిండా నిమ్మకాయ రసం తెచ్చింది. లోపల నుండే అన్నీ వింటూ వచ్చిన ఆమె-"అయిందా అబ్బాయిగారి పని- అన్నట్లు కొంటెగా చూసింది సూర్యంవేపు. అతడామెను చూడ కుండానే-" థియరీ అంతా బాగానే వుందండీ ప్రాక్టికల్‌గా ఆచరణ లోనే ఏదీ సరిగా వుండదు- అన్నాడు.

"రాజకీయాలయినా పరాకటయినా కూడా అంతేకదుటోయ్-"

"అవుననుకోండి..కాని రాజకీయాలు కనీసం మనిషినిమతులో వుంచవు కదండీ-ఇవాళ సాయంకాలం స్వామీజీ సభనే తీసుకుందాం- దానివలన ఒన కూడిన సామాజిక ప్రయోజనం ఏముంది? పై పెచ్చు అక్కడ చేరిన వారంతా ఇంతో అంతో డబ్బుకలవారే: దానినిబట్టి రకం మతానికి డబ్బుకూ బాగా దోస్తీ వుందనిపించడం లేదూ-?"

"ఈ రకం మతం" అన్నావు. అనగా ఈ భజనలూఅవేవా.. నేనూ ఒప్పు కుంటాను. ఇవి కేవలం ఒక వస్తువుని మనం కోనేలా చేయడానికి వాడే అందమైన పాకింగ్ కాగితం లాటివి. ఒకకోణం నుండి చూస్తే ఇవి చవక బారుగా, వెగటుకలిగించేవిగా వుంటాయి. ఆ "సెన్సిటివిటీ" వున్నవాడికివి అక్కర్లేదు. కొందరు బీచికెళ్ళి ఏకాంతంగా కూచో గలరు. కొందరు క్లబ్‌కెళ్ళిపేకాడందే నిద్ర

పోలేరు. కొందరు ఒక పుస్తకం చేతపట్టుకుని రోజులు రోజులు గడిపేయగలరు. మరికొందరికి కిక్కిరిసిన బజారు సెంటర్‌లో కాసేపయినా నిలబడి వస్తే తప్ప ఆరోజు సార్థకం అవదు. అలాగే మంత్రాలతో కొందరు, తంత్రాలతో కొందరు, భజనలతో కొందరు, ప్రాణాయామంతో కొందరు, విజ్ఞానమార్గంలో కొందరు, గాంధీజీలా, మదర్ థెరీసా లా మనుషులసేవలో కొందరు-తమతమ జీవితాలకు అర్థం వెతుక్కుంటారు.

దానికి నువ్వు ఏం పేరు పెట్టినా సరే-

"ఈ దేశంలో ఆకలి తీరనంత కాలం-ఈ మతాలు అక్కర్లేదండీ-"

"అలాగని అందరూ అనుకున్న నాడు మతాలు వాటంతట అవే పోతాయి! కాని తిండి. గుడ్డ వంటివి అందరికీ దొరికిన దేశాల వాళ్ళు తమ జీవితంలో ఏదో లోపించిందని మథనపడుతున్నారే-అదెందుకో ఆలోచించు"

"మన దేశంలో ముందుగా అందరికి తిండి, గుడ్డ రావాలి. అన్ని అసమానతలూ పోవాలి. దాని కోసం చేసే ప్రయత్నానికి అందరి శక్తీ, కాలమూ కావాలి. అది నా ఉద్దేశం——"

"భేష్.... అది నీ మతం అనడానికి ఆక్షేపణ వుంటే, అభిమతం అందాం. స్వార్థం తగ్గించి ఇతరుల కోసం కష్టపడాలని సంకల్పించిన క్షణంలో నువ్వు ఒక మెట్టుపై కెక్కావు. నీ కింక అష్టోత్తరాలూ పంచాక్షరీ మంత్రాలూ అక్కర్లేదు. ఆ ప్రయత్నమే తపస్సు: ఆ పోరాటమే యోగం——"

ఎందుకో సూర్యం కళ్ళలో నీరు నిలిచింది. తాను అంగీకరించనివి, అర్థం చేసుకోలేనివి ఎన్నో వున్నా ఆయన చెప్పిన తీరు, ఆ మాటల వెనకవున్న సిన్సియారిటి అతడిని కదల్చాయి. [illegible] దృక్పథాలు వేర్వేరుగా వున్నా ఇద్దరూ ఎక్కడో ఒక పాయింట్‌[illegible] కలుస్తున్నామనే అనిపించింది.

"వస్తానయ్యా! తొమ్మిదవుతూంది!" అని లేచాడు శ్రీపతి.

ఆయన వెళ్ళిపోయారు.

'నాన్న బతికి వుంటే ఇంతకన్నా పెద్దగా వుండీ వుం[illegible] వారేమో.... అమ్మా నాన్నా వుండడం ఎంత అదృష్టమో....

ప్పించింది సూర్యానికి.

ఆ రాత్రి—

"ఏమండీ- స్వామీజీకి నేను దండం పెట్టినప్పుడు మనేమని ఆశీర్వదించారో చెప్పనా...."

"ఏం చెప్పక్కర్లేదు.... పొద్దున్నడిగినప్పుడు గొప్పేంకు పూవుగా."

"మరి సమయం, సందర్భం వుండక్కర్లేదా-"

"దేనికి—"

...."దీనికి!"

"ఇంతకూ అసలు కబురు?"

"సుపుత్ర ప్రాప్తి-స్తు- అన్నారాయన...."

"పిచ్చిపిల్లా! ఆ మాట కె. జి. హెచ్. లో గైనకాలజిస్టు నాలి.... స్వాములవారు కాదు—"

"ఛ! వయసొచ్చినా మీకు వివేకం రావడం లేదు...."

"అలాగుటండీ బామ్మగారూ?"

—ఆ తర్వాత ఇహ మాటలు లేవు.

తర్వాత ఆరు నెలలలో చాలా మార్పులు జరిగాయి.

ఒక విదేశపు టూరు రావడంతో మధుసూదనరావు ఛాన్స్ ాతే రాదని, కార్మిక ప్రతినిధి వర్గంతో బాటు వెళ్ళి రెండు నెలలు ాటు తిరిగి వచ్చాడు.

హనుమాన్ ప్రసాద్ గారు కన్ను మూశారు. రాజేశ్వర ప్రసాద్ గారికి హార్ట్ ఎటాక్ రావడం, దాంతో మరికొన్ని కాంప్లి కేషన్స్ రావడంతో వారిని వెల్లూరుకు తీసుకువెళ్లాల్సివచ్చింది.

కామేశం కేసు వివరాలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. ప్రవదానం మునుపటంత విసురుగా వుండడం లేదు.

సూర్యం కార్యదర్శిగా ఏర్పడిన కొత్త యూనియన్‌లో ఉత్సాహవంతులైన కార్యకర్తలు చేరారు. సూర్యం యొక్క నిజాయితీ, విద్య, వినయం— వారికి పెట్టని పెట్టుబడిగా తోడ్ప డ్డాయ్. ఆరు నెలల వ్యవధిలో ఈ యూనియన్‌లోకి కార్మికులలో సగానికి పైగా వచ్చి చేరిపోయారు. సూర్యం తన ఉపన్యాసంలో చెప్పిన పద్ధతిలో "కార్మిక సంక్షేమ నిధి" ప్రారంభించారు.

వయోజన విద్యా కేంద్రం ప్రారంభించారు. సెకండ్ షిఫ్ట్ పని చే
వారికి రాత్రిపూట ఇళ్ళకు వెళ్ళడానికై బస్ సౌకర్యం గురి
యాజమాన్యంతో చర్చలు జరుగుతున్నాయి. చినబాబుగారికి తీ
లేకపోవడంతో ముఖ్యమైన నిర్ణయం వాయిదా పడుతోంది.

ఆసుపత్రిలో వరుసగా మూడు నెలల పాటు చికిత్స ప్లా
శస్త్ర చికిత్స జరగాక దుర్గ ఆరోగ్యం మెరుగయింది; ఇంకో మ
నెలల్లో ఆమె తల్లికాబోతున్నది. ఆమెను అలసట పడకు
కంటికి రెప్పలా కాపాడుకుంటూ, యూనియన్ వ్యవహారా
చూసుకుంటూ, డ్యూటీని చూసుకుంటూ సతమతమవుతున్నా
సూర్యం.

రాజేశ్వర ప్రసాద్ గారి ఆరోగ్యం కొంచెం స్థిమితపడిం
వారు స్పెషల్ ప్లేన్‌లో విశాఖపట్నం వచ్చేశారు. దాంతో చినబా
గారి హైరానా కొంత తగ్గింది. ఆయన చాలాకాలం తర్వా
ఆఫీసుకు రోజూ వచ్చి మామూలుగా వ్యవహారాలన్నీ చూసుక
గలుగుతున్నారు.

ఈ అయిదారు నెలలలో మధ్య మధ్య వచ్చినప్పుడు
కొద్దిగా అన్నీ తెలిసినప్పటికీ — పరిస్థితులు ఇంతగా మా
పోయాయని మాత్రం అనుకోలేదు.

తాను లేకపోయినా తన ఎగుమతులు ఏమీ పడిపోలేదు
కాంట్రాక్టుల ప్రకారం అన్నీ వెళ్ళిపోతున్నాయి. చాలా సంతృప్తిగ
నిట్టూర్చారు చినబాబు.

'ఈ సూర్యం.... పూర్ ఫెలో-' ఆ రోజు అరిస్తే కిక్కుర
మనకుండా వెళ్ళిపోయిన వాడు హఠాత్తుగా వామనమూర్తి
'ఇంతింతై వటుడింతయై' అన్నట్లు ఎదిగిపోయి ఒక 'ఫోర్స్' ల
కూడున్నాడే.... చూడాలి పరిస్థితి.... ఇంతకూ ఈవామనుడి క్రింద
నలిగిపోయే బలి చక్రవర్తి ఎవరు-తనా....నో నో ! లేక మధునా
పూర్ ఫెలో.... హేడ్ ఎ లాంగ్ ఇన్నింగ్స్....కన్నింగ్ బాస్టర్
బట్ ఎ వెరి యూస్‌ఫుల్ ఫెలో....'

అర్జెంటుగా ఫోను వచ్చింది.

ఫ్యాక్టరీలో అగ్ని ప్రమాదంట !

స్వర్గం నుండి నరకానికి....

కారులో పసగెత్తాడు చినబాబు.

షిప్పింగ్ విభాగంలో నిప్పంటుకుంది. ఆ పాటికే ఫైరింజను వచ్చి పోరాడుతున్నాయి. వర్కర్లు కూడా సాయపడుతున్నారు.

నలభై నిముషాలలో నిప్పు పూర్తిగా ఆరిపోయింది. కాని చినబాబు మనసులో సందేహం రాజుకుంది. ఈ ప్రమాదం దానంతట అది జరిగిందా, లేక,.... ఎవరన్నా కల్పించారా? అయితే ఎవరు? ఎవరు?

ఎగుమతి కని నిర్దేశించిన లక్ష రూపాయల సరుకూ, ఒక వేనూ కాలి పోయాయని మరు రోజు తెలిసింది. ఇన్సూరు చేసినవే గనుక.... నష్టమేమీ లేనట్లు లెక్క—

మూడు రోజుల తర్వాత ఏదో పని మీద వచ్చిన మధు— "ఆ అగ్ని ప్రమాదం సూర్యం యూనియన్ వాళ్ళచేయించిందే.... నాకు తెలిసింది—" అన్నాడు.

"ఆధారాలేమిటి?" అని అడిగాడు చినబాబు.

"ఇలాటి వాటికి ఆధారాలు దొరకుతాయిటండీ....!" అన్నాడు మధు.

'ఇడియట్.... నిన్న రాత్రి కాంపౌండ్ గోడవతల చెత్త కుండీలో ఒక పెట్రోల్ కేన్ దొరికిందనీ, దానిని వేలి ముద్రల ఎక్స్‌పర్ట్ దగ్గరకు పంపించానని తెలిస్తే ఏమంటాడో....' అనుకున్న చినబాబు మాట్లాడలేదు.

మరు రోజు మధ్యాహ్నం సూర్యం యూనియన్‌తో యాజమాన్యం వారి మీటింగ్ జరిగింది. ఎనిమిది నెలల నుండి వాయిదా పడుతూ వచ్చిన ఆ సమావేశంలో ముఖ్యాంశం రాత్రివేళ కార్మికులింటికి వెళ్ళడానికి బస్ సౌకర్యం కంపెనీ కల్పించాలి అన్నమాండు.

పై డితల్లి మరణం దగ్గర నుండి ఎత్తుకుని సకారణంగా, సవినయంగా తమ కోరికను విశదీకరించాడు సూర్యం.

యాజమాన్యం తరఫున ఫైనాన్షియల్ అడ్వైజర్ "వీలు లేదు!" అన్నాడు.

సూర్యం చినబాబును అడిగాడు.

"యాజమాన్యం అంటే ఒకటే ఆలోచన; ఒకటే నోరు;

అది అయిదు విధాల మాట్లాడదు—" అన్నాడాయన.

సమావేశం ముగిసింది.

ఆ రాత్రి యూనియన్ అసాధారణ సమావేశం జరిగింది. అర్ధరాత్రి దాకా తర్జన భర్జనలు జరిగాక ఈ కోరికను గనుక వారం రోజులలోగా అంకగీరించకపోతే సమ్మె చేయవలసి వస్తుందని నోటీసు ఇవ్వాలి అని నిర్ణయించారు.

ఇంటి దగ్గర.... "ఏమండీ! నాకేదో భయంగా వుందండీ మీరీ యూనియన్ గొడవలో ఎందుకు దిగారండీ.... హాయిగ ఆ కర్నూల్లోనే వుంటే పోనేమో—" అని బెంగపడింది దుర్గ.

"చైతన్యం ఉన్న మనిషెవరయినా అన్యాయాన్ని ఎదుర్కొనక వుండలేరు. అన్యాయం ఇక్కడే కాదు. కర్నూలులోనూ వుంది; కాన్పూరులోనూ వుంది. దాన్ని కనబడిన చోటల్లా ఎదుర్కోవాలి. లేకపోతే సంఘం ముందుకు నడవలేదు—"

"ఏమో బాబూ...."

"ముందు నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో.... బాబు చక్కగా బొద్దుగా వుండాలి. అనవసరమైన ఆలోచనలు పెట్టుకోకు—"

వారం గడిచింది.

సూర్యం యూనియన్ ఇచ్చిన నోటీసుకు సమాధానమే రాలేదు.

వెంటనే యూనియన్ సర్వసభ్య సమావేశం జరిగింది.

అందరూ ఏకగ్రీవంగా సమ్మె ప్రతిపాదనను సమర్థించారు.

యాజమాన్యానికి సమ్మె నోటీసు పంపారు.

యాజమాన్యం పలకలేదు.

సమ్మె ఆగస్టు ఆరవ తేదీ ఉదయం మొదటి షిఫ్టు ప్రారంభమైంది. నాలుగు వందల మంది కార్మికులలో రెండు వందల తొంభై మంది సమ్మె చేశారు.

మధు చిన బాబును – కలిశాడు :– "చూశారా! నేను అప్పుడే చెబితే, మీరు వినిపించుకోలేదు—" అని ఎగసన దోశాడు.

ఆ సాయంకాలానికి సమ్మె చేస్తున్న వారందరూ సస్పెండ్ చేయబడ్డారు.

-మూడురోజులు అయింది. పరిస్థితిలో మార్పులేదు. ధైర్యంగా వుండండి.... మనంకోరుతున్న కోరిక సబబయినది. తప్పకుండా జయిస్తాం. నాల్గింట మూడు వంతుల మంది మనతో వున్నారు-" అనగానే

"మాకేవిటండా భయం! మీలాంటి వాళ్ళుముందర నిలబడ్డాలే గాని గడగడలాడించేయ మేటండా.... ఇన్నాళ్ళు ఆ కేడీగాడు మా నాయకుడు నాయకుడు అని నమ్మి మోసపోయాంగాని...." అన్నాడు అప్పన్న.

అయిదోరోజులోకి వచ్చింది సమ్మె. పరిస్థితి ప్రశాంతంగా వుంది. ప్రముఖ దినపత్రికలన్నీ సమ్మె వార్తను స్థానిక వార్తల క్రింద ప్రకటించి సంతృప్తి పడ్డాయి.

ఆరురోజులలో ఒక్కరోజయినా సూర్యం రాత్రిఒంటిగంటకు తక్కువగా ఇంటికి వెళ్ళలేదు. ప్రతిరోజూ మీటింగులు, కార్మికు లను వాళ్ల ఇళ్ల దగ్గర కలుసుకోవడం, మరీ ఇబ్బందిగా వున్న వాళ్లకు యూనియన్ ఫండ్ నుంచి అడ్వాన్సులు ఇవ్వడం, నగరంలోని ఇతర సంస్థల యూనియన్ నాయకుల్ని కలిసి వారికి పరిస్థితి తెలియజేసి వారి సహకారాన్ని అభ్యర్థించడం- ఇట్లారోజుకు ఇరవై గంటల చొప్పున పనిచేస్తున్నాడు సూర్యం.

దుర్గ ఆందోళన నానాటికి పెరిగిపోతోంది.

"ఏమీ ఫరవాలేదమ్మాయ్!....మా ఉద్యమం విజయాన్ని సాధిస్తుంది. కార్మికులు చెక్కు చెదరకుండా వున్నారు." అని అంటుంటే బాగా అలసిపోయిన అతడి మొహం ఉత్సాహంతో వెలిగి పోయేది.

అట్లా ఆరోగ్యం పాడు చేసుకుంటున్నందుకు అతడిని మందలించాలో, నలుగురికీ మంచికోసం నిద్రహారాలు మాని శ్రమిస్తున్న అతడిని అభినందించాలో తెలియని దుర్గ-అతడిని అక్కున చేర్చుకుని నెమ్మదిగా వేళ్ళతో తల దువ్వి నిద్ర పుచ్చేది.

"అమ్మ ఒడి ఇలాగే వుండేదేమో-" అనుకుంటూ నిద్రలోకి ఒరిగి పోయేవాడు సూర్యం.

ఒక్కోసారి ఆమె పొటమీద ప్రేమగా ముఖాన్ని రుద్ది- "ఏమంటున్నాడు అబ్బాయి?" అనేవాడు-.

"తండ్రిగారి తిరుగుళ్లేమీ బాగులేవంటున్నాడు-" అనేది దుర్గ.

"తాగుడూ జూదమూ- మానేయమంటున్నాడా?"

"మీరలాంటి వారు కారు. నా బంగారుకొండ!" అని ముద్దు పెట్టుకునేది దుర్గ.

ఇంత అగ్నిపరీక్షలోనూ ఆమె సన్నిధి చలిపందరలావుండేది సూర్యానికి!

-తొమ్మిదవరోజు రాత్రి.

గాజువాకవైపు రెండు మీటింగులు పూర్తిచేసి సూర్యమూ. అప్పన్నా, ఇంకో ఇద్దరూ సైకిళ్లమీద వస్తున్నారు.

హార్బర్ ఛానెల్‌లో ఫెర్టిలైజర్ బెర్త్ దగ్గర ఒక నౌక నిలబడి వుంది. దానికెదురుగా రెండు యుద్ధనౌకలున్నాయి దూరం. నుంచి ఒక లాంచి నీళ్ళను చీల్చుకుంటూ వస్తూంది. కోటి దీపాలూ, నీటిలో దీపాల ప్రతిబింబాలూ అది వేరే లోకమా అనిపిస్తున్నాయి.

సూర్యం బృందం దాటారు. అక్కడి నుండి రోడ్డు ఎడమకు మలుపు తిరిగి నేవల్ బేసంతా చుట్టుకొని వస్తుంది.

ఆ రైల్వే బ్రిడ్జి పక్క రోడ్ దాటారు.

హఠాత్తుగా పదిమందీ, ఇరవై మందీ వారి మీద దా[illegible] చేశారు. కర్రలతో, ఇనప వూచలతో కొట్టసాగారు.

సైకిళ్ళ మీద నుండి పడిపోయారు. చేతులతో ప్రతిఘటించబోయారు కాని సాయుధులైన ప్రత్యర్థుల దెబ్బకు తట్టుకోలేక నేలకొరిగారు.

వాళ్ళని చచ్చేలా కొట్టాలనుకున్నారుగాని ఈ లోగా దూరంగా లారీ హెడ్ లైట్స్ కన్పించడంతో దుండగులు పారిపోయారు.

లారీ ఆగింది!

రక్తపు మడుగులో స్పృహలేకుండా పడివున్న నలుగురినీ ఆ ట్రక్‌లోని వారు తీసుకెళ్లి కింగ్ జార్జి హాస్పిటల్‌లో చేర్చారు. పోలీసులకు చెప్పారు.

పోలీసులు ఆచోటికి వెళ్లి చూడగా ఒక ఇనుప వూచ దొరికింది. పక్కన పొలాల్లో పాదాల ముద్రలు కన్పించాయి.

ఆ రాత్రి సూర్యం, ఇంటికి రాక పోవడం-దుర్గకు అర్థం కాలేదు.

"ఎంత మీటింగయినా, ఏమయినా సూర్యం రాకుండాపోదే- ఈనాళ్లల్లో ఒకరిని విడిచి ఒకరం ఇరవైనాలుగంట లెప్పుడూ వుండలేదు..నాలాగే ఆయనకూ చిన్ననాడే తల్లీ తండ్రీ కరువయ్యారు. ఎడారిలో మొక్కల్లాంటి ఇద్దరమూ...ఒకరికొకరు ఒయాసిస్సులమయ్యాం అమ్మో ఆయనకేమీ కాకూడదు, ఏమీ అవదు...."అయినా తెల్లవారి పోయింది. నిన్న పొద్దుననగా వెళ్ళారే....ఒకగంటయినా ఇంటికి రాకుండా వుండని మనిషి ఏమయినట్టు-ఏమయినట్టు!"

ఆస్పత్రిలో ఎమర్జెన్సీ వార్డులోకి తన బంధువును చేర్పించ డానికి వెళ్ళిన భద్రయ్యఅనే కార్మికుడు- అక్కడ తమ నాయకుడు సూర్యం, ఇంకోముగ్గురూ వుండడం చూచి భయవిహ్వాలు డయ్యాడు కాప్పేపటికి తీరుకుని దగ్గర్లోవున్న తోటి కార్మికుల ఇండ్లకువెళ్లి చెప్పాడు. వాళ్లల్లో ఇద్దరు సూర్యంఇల్లువెతుక్కుంటూ వచ్చారు-....

రాత్రి పదయినా చినబాబు ఆఫీసులోనే వున్నారు.

పరిస్థితి చేయిదాటి పోతున్నదా.... అన్న సంశయం మొద లయింది. తాతయ్యా, నాన్నల హయాంలో ఇలాంటిది రాలేదు. నాన్న గారి నడుగుదామంటే ఆయన ఆరోగ్యం అంతంత మాత్రంగా వుంది. ఆ వెధవ వ్యాస్-వాళ్లడిగింది ఇచ్చేస్తే పోయి వుండేది— కాని అనవసరంగా ఆ ముసలి వెధవ ఫైనాన్షియల్ అడ్వయిజర్. మాట కొంత, అనవసరంగా సూర్యానికి ప్రాముఖ్యం పెరిగి పోతుందేమోననేశంక కొంతా కలిసి- 'నో!' అనాల్సి వచ్చింది....ఈ తొమ్మిది రోజుల్లో ప్రొడక్షన్ లాస్ రెండున్నర లక్షలు దాటి వుంటుంది.. అంతకన్నా ఘోరం.. ఆ అగ్ని ప్రమాదానికి కారకుడు మధుసూదనం అని తేలడం....

బజర్ మోగింది. "సార్! యూనియన్ లీదర్ మధు మీ కోసం వెయిట్ చేస్తున్నారు...."

ఎదుట వచ్చి కూచున్నాడు మధు.... అవీ ఇవీ అయ్యాక.... "సార్! మీరు ఇంకా వూరుకుంటే లాభం లేదు. ఇంకో యాభై పేలివ్వండి.... ఇరవైనాలుగ్గంటల్లోగా అందరూ డ్యూటీకి హాజరయి పోయేట్లు చూస్తాను—"

"మిస్టర్ మధు! మీలో సత్తా వుంటే ఈ సమ్మె ఇన్నాళ్లు సాగి వుండేదికాదు—"

"అదేవిటి సార్...."

"మొదట ఇరవై వేలు పట్టుకెళ్లారు. దాని వల్ల ఏమీఫలితం కనబడ లేదు. ఇంకాయాభై కావాలంటున్నారు.... ఆ సూర్యం డబ్బు లేకుండానే ఇంత మంది నెట్లా కూడ గట్టుకో గలిగాడు?...."

"ఇంకెక్కడి సూర్యంసార్.. అయిపోయింది అతడి పని...."

"అంటే? వాట్ డుయు మీన్?"

"అవ్నే....అదే....తొమ్మిది రోజులయిందికదా.... వర్కర్సంతా తిరగబడు తున్నారు...."

తల అడ్డంగా వూచాడు చినబాబు.

ఉత్తచేతులతోనే వెనక్కి వెళ్లాడు మధు.

"పూర్ ఫెలో..హిస్‌గేమ్ ఈజప్!" అనుకున్నారు చినబాబు-

-ఆఇద్దరు కార్మికులు వచ్చి సూర్యం ఆస్పత్రిలో వున్నాడని చెప్పగానే దుర్గమనసంతా ఖాళీగా అయిపోగా, పరుగుత్తుకెళ్లి ఆయన్ని చేరి పోవాలని మెట్లు దిగబోయి, తడబడి అయిదారుమెట్లు జారి, దొర్లింది.

సూర్యం ఏ ఆస్పత్రిలో వున్నాడో ఆ ఆస్పత్రిలోనే ప్రసూతి వార్డులో ఆమెను చేర్పించారు.

డిప్యూటి సూపరింటెండెంట్ గుప్తా, సుదర్శన ప్రసాద్‌కు ఫోన్‌చేశాడు: "ప్రసాద్‌సాబ్! మార్నింగ్! పొద్దున్నే అన్‌ప్లెజంట్ న్యూస్ ఇస్తున్నందుకు క్షమించండి....

"వాటీజిట్ గుప్తా?"

"నిన్నరాత్రి పది,పదిన్నర మధ్య పేరలెల్ బ్రిడ్జెస్ వద్ద మీ స్ట్రెయికింగ్ యూనియన్ నాయకుడు సూర్యాన్ని అతడ అనుచరులు ముగ్గురినీ స్పృహ తప్పేలా ఎవరో కొట్టారు....

"వాట్!" అని ఎగిరిగెంతేంత పని చేశాడు సుదర్శప్రసాద్. సూర్యాన్ని కొట్టారా....ఎవరు? ఎవరు చేసిందా పని....!"

"ఇంకానిర్ధారణగా తెలియలేదు....కొన్ని "క్లూస్" దొరికాయి వుయ్ ఆర్ క్లోజింగ్ ఇన్....ఇంకో ఇరవై నాలుగ్గంటల్లో తేలుతుంది.

"ప్లీజ్! విషయం తేలగానే నాకువెంటనే చెప్పండి మిస్టర్ గుప్తా!"

"ష్యూర్‌సర్!"

"గుప్తా! సూర్యం ఎక్కడున్నాడు? ఎలా వున్నాడు_"

"కె.జి.హెచ్‌లో వున్నాడు. మల్టిపుల్ ఫ్రాక్చర్స్.... హెవీ బ్లీడింగ్....బ్రెయిన్ డేమేజ్ ఏమీలేదుకాని ఇంకా అన్‌కాన్షస్‌గా వున్నాడు...."

చినబాబు తీవ్రమయిన ఆలోచనలో పడ్డాడు. ఆస్పత్రి సూపరింటెండెంట్‌కు డయల్ చేశాడు.

ఆ రోజు సాయంకాలానికి దుర్గకు స్పృహ వచ్చింది....

"ఏడీ.... సూర్యం ఏడి.. ఎక్కడున్నాడు ఎలా వున్నాడు...."

"ఉన్నారమ్మా....దెబ్బలు తగిలాయిగాని భయం లేదు. మీరు శ్రమపడకండి.... అంది నర్సు....

దుర్గ మళ్ళీ అటు మెలకువ ఇటు మగతకానిస్థితిలోకి జారింది.

....ఏమిటీ హాయి.... తనకు శరీరమే లేనట్లుగా తేలిపోతున్నదే.... అయ్యో.... తన కేదో గుచ్చుకుంది...."పరవాలేదమ్మా" అంటూ తన్ను హృదయానికి హత్తుకుంది.... ఎవరది- అమ్మ కదూ. అబ్బే కాదు కాదు.... సుధక్కయ్యా హత్తుకున్నట్లే హత్తుకుని.... అమ్మో.... ఊపిరాడ్డం లేదు, గొంతు పిసికేస్తూంది.. గొంతు పిసికేస్తూంది.... కడుపులో శూలాలు గుచ్చుతోంది.... దేవీ.. తల్లీ.... అమ్మా....

"అమ్మాయండీ!" అంది ఆ డెలివరీ అటెండయిన హౌస్ సర్జన్ ప్రమరాంబ....

దుర్గకు తెలివొచ్చి చూసుకుంటే పక్కన....నల్లటి జుత్తుతో అమాయకంగా కళ్ళు మూసుకుని నిదపోతున్న పాపాయి.. మరుసటి రోజు ఉదయం కళ్ళు తెరిచాడు సూర్యం....

గుడ్డివాడికి చూపు వచ్చినట్లయింది.

"దుర్గ....ఏది" అని సైగ చేసి అడిగాడు.

ఆ వార్డుకు ఈ వార్డుకు మధ్య తిరుగుతున్న మిత్రుడొకడు "మీరు తండ్రి అయ్యారు! అమ్మాయి పుట్టింది!" అన్నాడు.

అన్ని బాండేజిల మధ్య అకడి కళ్ళు మెరిశాయి.

"దుర్గా_ దుర్గా!"

సూర్యం కళ్ళు మూసుకున్నాడు.

ఒక్కరోజు వ్యవధిలో ఆ మిగిలిన వందాచిల్లర మంది

తామూన మెమోలో చేరుతున్నామని యాజమాన్యానికి రాసిచ్చారు.

—"సార్!"

"హలో మిస్టర్ గుప్తా! ఎనీ న్యూస్....?"

"ఎస్సార్.... మొన్న రాత్రి సూర్యంని కొట్టింది మధుసూదనం తాలూకు మనుషులేనని తేలింది.... అతడి ముఖ్య శిష్యుడయిన గవర్రాజు ఇంట్లో రక్తపు మరకలున్న ఐరన్ రాడ్స్ అవీ దొరికాయి. ఫుట్ ప్రింట్స్, ఫింగర్ ప్రింట్స్ అన్నీ సరిపోయాయి. గవర్రాజు ఒప్పేసుకున్నాడు.

"ఐసీ!"

"మొన్నటి ఫైల్ కేస్, ఇదిగో.... ఇదీ కలిపి మధుసూదనరావుని కస్టడీలోకి తీసుకుంటున్నామండీ....

"ప్రొసీడ్!" అన్నారు చినబాబు.

—అడ్మిట్ అయిన వారానికి సూర్యం లేచికూచో గలిగాడు.

అతడి మంచం పక్కనే దుర్గ కూచుని వుంది. ఆమె చేతిలో పాపాయి వుంది.

"చిన్నారి ఎవరి పోలికో?" అని అడిగింది దుర్గ....

"వాళ్ళమ్మదే ఆ అందం—" అన్నాడు సూర్యం—

"అబ్బే నాదేమందంలే తల్లీ.... మీ నాన్నగారి ఆ గడ్డమూ, లోతుకు పోయిన కళ్ళూ, కిరీటంలా ఆ కట్టూ.... అదీ అందం అంటే!" అంది దుర్గ పాపాయికి నాన్నను చూపిస్తూ.

ఎందుకో బోసి నోటితో నవ్వింది పాప.

"అమ్మ దొంగా! నువ్వూ అమ్మ పార్టీయేనా యేమిటి—" అన్నాడు సూర్యం పొంగిపోతూ....

ఈ లోగా "కార్మికుల ఐక్యత జిందాబాద్.... సూర్యం బాబు జిందాబాద్—" అని కేకలు విన్పించాయి.

ఆ వెంటనే "ష్.... ఇది ఆస్పత్రి! గొడవ చేయకండి—" అన్న నర్సు హెచ్చరిక వినిపించింది.

"సార్.... సార్ మనం గెలిచాం సార్! మన డిమాండ్లన్నిటికీ యాజమాన్యం ఒప్పేసుకుంది సార్.... ఇదిగో కాగితం—" అంటూ వారిచ్చిన కాగితం సూర్యం చదివాడు.

అది తనకే రాసింది.

రెండవ షిఫ్ట్ కార్మికులకు రాత్రివేళ ఉచిత బస్ సౌకర్యం కల్పిస్తామనీ, సస్పెన్షన్ నోటీసులు ఉపసంహరించబడినాయనీ, కార్మికులు అందరూ పనుల్లోకి రావల్సిందిగా కోరుతున్నాననీ, కామేశం వంటి అన్యాయం జరిగిన కేసులన్నిటినీ పునః పరిశీలిస్తామనీ వుంది అందులో.... చివర "మీరు త్వరగా ఆరోగ్యం కోలుకోవాలని మనసారా కోరుతున్నాను—" అని వుంది.

ఆ క్రింద వయొలెట్ సిరాతో "బి. సుదర్శన్ ప్రసాద్—" అన్న సంతకం వుంది.

పూలమాలలయితే తెచ్చారు గాని కార్మికులు సూర్యానికవి వేయలేకపోయారు.

వాళ్ళభిమానం చూచి దంపతులిద్దరి కళ్ళూ చెమర్చాయి.

"మీకింత పెద్ద కుటుంబం వుందని నాకు తెలియదు సుమండీ!" అంది దుర్గ....

నవ్వాడు సూర్యం. నెమ్మదిగా పాపాయి అర చేతిలో తన వేలిని వుంచాడు. పాపాయి అరచేతిని మూసుకుంది. తన వేలిని గట్టిగా పట్టుకుంది.

"ఔను దుర్గా! నిజానికి ప్రపంచమంతా ఒక పెద్ద కుటుంబం. అందులోని బలహీనులంతా పాపాయిలు. వాళ్ళకు చేయూత నివ్వాలి నడక నేర్పించాలి. పరుగులు నేర్పించాలి."

"మళ్ళీ లెక్చర్ మొదలెట్టేశారు మీ నాన్న, చూశావామ్మా!" అని ఫిర్యాదు చేసింది దుర్గ పాపాయితో.

"ఈ నాన్న ఎప్పుడూ ఇంతేకదమ్మా సమతా?"

ఒక్క నిముషం తెల్లబోయింది దుర్గ. నవ్వేసింది "చూశావా తల్లీ? తనే నీకు పేరు పెట్టేసి నిన్ను తన పార్టీలో చేర్చేసుకుందామని ఎత్తు వేస్తున్నారు మీ నాన్న!"

పాపాయి అమ్మకేసి చూసింది.

"జీవితంలో వెలుగే ఎక్కువ"— అనుకుంది వాళ్ళమ్మ.

[అయిపోయింది]

# కాలుతున్న చేంతాడు

శివల జగన్నాధరావు

అవతల పడుతున్న ప్రాణంతో ఆఖరుసారిగా ఆర్తనాదం చేసిన జంతువులా సోడాకాయి కీచుమన్నాది. అదందుకొన్న పెద్ద మనిషి గుటగుటా తాగిచ్చేసి, పాంటు జేబులోంచి దాని ధర తీసి చ్చాడు.

డబ్బులు గల్లాపెట్టెలో పడేసి రాజు తలెత్తి అటుచూసి నిట్టూర్చేడు. కళ్ళలో ఆత్రం, మనసులో విచారం.

"ఇదిగో! రెండు వక్క-పొట్లాలివ్వు!"

"ఆ పచ్చరిబ్బన్లు అరడజనిస్తావా?"

"లిమ్కా ఓటి కొట్టవోయ్!"

"ఏయ్! ఈ చాక్లెట్టు ఒకటివ్వు!"

రాజు చేతులు చకచకా పని చేస్తున్నాయి. మనసు అంత ఉత్సాహంగా లేదు. వాళ్ళని పంపించి సర్దుకుని కూచున్నాడు. బేరాలు వస్తే సర్దుకుని కూచుండకిలేదు. చాలా వేగంగా పనిచెయ్యాలి. 'మెరుపులా కనిపించాలి వాళ్ళకి' ఇది నారాయణ మాట! అట్లా కనిపిస్తేనే చకచకా అమ్ముడయిపోతాయిట సరుకులు! వ్యాపారం బాగా వుంటాదట!...."

నారాయణ పూర్వం.... అంటే, తనకీ బడ్డీమీద చోటుయిచ్చిన ఆరంభంలో అలాంటి మాటలు, అదేదో తారక మంత్రంలాగ చెప్పేడు.

"నీకు నేను ఏ వుద్దేశంతో ఈ పనిస్తున్నానో, అట్లాగే నా వుద్దేశాన్ని నిలబెట్టాలి!! వ్యాపారం అంటే మాటలుకావు! ఎంత చురుగ్గాచేస్తే అంతగా పుంజుకుంటది!...." అని చెప్పేడు నారాయణ

ఒకనాడు తను అతని దగ్గిరికి వెళ్ళి తిండికి జరగడం కష్టంగా వున్నాదని చెబితే....

ఈ వూళ్లో, తమున్న వాడలోనే నారాయణ వున్నాడు. అతనికీ బడ్డీ వున్నాది. ఇంకో హోటలూ వున్నాది. పెద్ద డాబా సెళ్ళు రెండున్నాయి. రెండు వ్యాపారాలు....ఒక ఇంటిమీద అద్దె కలిసి బాగానే ఆదాయం వస్తుంది.

తను కనిపించి చెయ్యి చాచినప్పుడల్లా నారాయణ యెంతో కొంత పైసలు పడేసేవాడు చేతిలో.

ఒకసారి అడిగాడు: "ఇదిగో! నీ బాబూ, అమ్మా లేరేవిట్రా?"

తల అడ్డంగా తిప్పేడు తను "లేరు" అన్నట్టు....

"నువ్వు పుట్టేసరికే సచ్చేరేమిట్రా, ఆళ్లు!"

"అవునండి...."

"మరయితే గాలికీ, ధూళికీ పెరిగేవా?"

"ఏదో తమలాంటి మారాజులుండగా....ఒకరిదగ్గర అన్నం అడుక్కునీ, ఇంకోరి అరుగుమీద పడుక్కునీ...."

"బడికెళ్ళాలనిపించలేదట్రా, నీకూ?"

"అనిపించిందండీ! కానయితే ఎలాగ! పుస్తకాలు అయ్యీ ఎలా వస్తాయండి? నాకు సదువు వచ్చేదీ రాసి లేదండి!"

నారాయణ ఆవిధంగా కొన్నిసార్లు కిందా మీదా ప్రశ్నలు వేసి, "వీడి సంగతేమిటి! ఎలాంటివాడని" సమాచారం రాబట్టుకుని బాగా ఒక నిర్ణయానికి వచ్చాక, తన కొట్టుమీద కూచుని సరుకులు అమ్మే పని ఇచ్చేడు.

"నీమీద నమ్మకంతో నేనీ పనిస్తున్నాను! నా నమ్మకాన్ని నిలబెట్టాలి! నువ్వు నాకే చుట్టానివీ కాకపోయినా....నీకీ బడ్డీ కొట్టు ఇస్తున్నానంటే .... అది నీమీదెంత విశ్వాసంవో చూడు! నీ బీద తనంమీద జాలీ, నీ నిజాయితీమీద విశ్వాసంవూ నాకుండబట్టేగదా! ఏటంటావు?...."

బుర్ర వూపేడు తను.

బుర్ర వూపేడు రాజు, "ఆ పుస్తకం ఇవ్వు!" అన్న ఆసామీన్ని చూసి, ఇచ్చేడు. అతనా పుస్తకం అట్టచూసి కళ్ళు వెడల్పు చేశాడు. పేజీలు గబగబా తిరగవేసాడు. మొహం చెమటపట్టిందతని

సికి. "అదెకిస్తావా?"

"రెండ్రూపాయలు కట్టాలి! ఆతర్వాత పుస్తకానికి పదిహేను పైసాలు!" చెప్పాడా వివరాలు!

అతనా డబ్బులిచ్చేసి, పుస్తకం తీసుకువెళ్ళేడు.

రాజు బడ్డీమీద తోరణాల్లా వేలాడుతూన్న పుస్తకాల్ని చూసేడు. డిటెక్టివ్ పుస్తకాలు, సెక్సు పుస్తకాలు .... అట్టలమీద రంగులు కళ్ళు మిరుమిట్లు గొలిపేలా వున్నయ్! బొమ్మలు గుండెని పట్టు తప్పించేసి జారిపోయేలా కనిపిస్తున్నాయి!

పుస్తకాల్ని కళ్ళతో, చేతుల్తో తడివేడు రాజు. వయసు ఒంట్లోకి చేరకముందు "అవి" "అవేమిటో" అనిపించేయి! వయసొచ్చాక "అవి" తలపుల్ని తలుపులుకట్టి పిలిచేయి! ఒంట్లోనెత్తురు వేగంగా పరిగెత్తేది! గొంతు దాహంతో ఆరిపోయేది!

చుట్టూ చూసేడు. దాహం పుట్టించేవీ తన దగ్గరే వున్నాయి! దాహం తీర్చేవీ తనదగ్గరే వున్నాయి! ఒకసారి సోడా తీసి తాగేడు! కొంత మనశ్శాంతి అయినాది! లిమ్కా తాగే అదృష్టం లేదు! డబ్బు లెక్కువ కట్టుకోవాలి, నారాయణకి!! తను సినీమాలు అప్పలు చూడకముందు - గోడలమీద సినిమా బొమ్మలు చూసీ, చేతుల్తో తడివీ కొంతవరకూ తృప్తిపడేవాడు.

ఈ పుస్తకాలతో అనుభవం అలాగే వున్నాది! చదవడం తనకి రాదు! ప్చ్! వస్తే ఎంతబావుణ్ను! "పైనే ఇంత బావున్నాయే ఇంక ఆ సిన్మా చూస్తే ఎంత బాగా వుంటాదో!!" అనుకున్నాడు అప్పుడు. ఆ తర్వాత డబ్బులూ, వీలూ చిక్కినప్పుడు వెళ్ళిచూసేడు సినీమాలు! కానీ....ఇవి? పుస్తకాలు చదవడం అనే కోరిక మాత్రం అలాగే వుండిపోయింది!! అదిగుండెలో సన్నగా రగులుతోంది!....

ఎండ ఎక్కువతోంది, క్రమంగా.

రాజు గుండెలో విచారం, ఆరాటం ఎక్కువౌతున్నాయి,

రాడేం ఎప్పటికీనూ?! అసలు వస్తాడా?

నిట్టూర్చుతూ కూచున్నాడు. బస్సులు, లారీలూ, కార్లూ దుమ్మును లేప, రోడ్డు వెళ్ళే వాళ్ళమీద పోసి, పోతున్నయ్.

"రెండు బీడీలివ్వు!"

ఇచ్చేడు. బడ్డీకో పక్కన వేలాడే చేంతాడు నిప్పుతో బీడీ

అంటించుకుని, డబ్బులిచ్చేసి, వెళ్ళేడతను. రాజు తనో బీడీ తీసి ఆ చేంతాడుకొసతో ముట్టించుకున్నాడు. బీడీ పొగ లోపలికి వెడితే ప్రాణం హాయిహాయిమన్నాది.

ఎండ ఎక్కిపోతోంది. పైము ఎంతవుతుంది? పదా? ఆ బడి తెరిచీ అప్పుడే చాలాసేపైందే! పద్దాటిపోతది!

రాజు విసుగ్గా చూస్తున్నాడు, ఎండలోకి, రోడ్డుకేసి దికి.

బడ్డీదగ్గరికి, బడ్డీలో వస్తువులు కావల్సినవాళ్లొస్తున్నారు.

బడ్డీ దగ్గరికి, బడ్డీలో వున్నవాడి కాక్కావల్సిన వాడు మాత్రం రావటంలేదు! ప్చ్! నోట్లో బీడీ కాల్తోంది.

బడ్డీపక్కన వేలాడుతోన్న చేంతాడు కాల్తోంది.

రాజు గుండెలో కోరిక కాల్తోంది....

నిట్టూర్పు. సన్నగా మూలుగు. మనసు దొలిచివేసే విచారం. గుండెలో అసంతృప్తి, బాధ. కళ్ళల్లో ఎరుపు జీరలు.... మరోబీడీ.. ఇంకో బీడీ....కట్ట కాల్చినా ఈ లోటు తీరదు! కానియ్యి దీనమ్మ..! ఎన్నయినా వృత్తినే కాదు గద! డబ్బు లిచ్చేద్దాం షావుకారికి! మునుపటంత ముష్టిగా నేంవు గద!! ఎంతో కొంత ఆదాయం వొస్తోంది! ఎలాగో, ఒకలాగ, పాక అద్దెకి తీస్కున్నా తన కొంపలో తనుంటున్నాడు! తన అన్నం తను తింటున్నాడు!

గుడ్డిలో మెల్ల బతుకు!

అయితే....ఒక్కటే యిచారం!! ఈ బతుకుతోనే తనిలా ఎళ్ళిపోవాలా, కాటికి?! తనకి సంపాయించే శక్తి వున్నాది. ఒంట్లో సత్తువున్నాది! వయసున్నాది!?....?!....

"నీకేంరా, రాజూ? నీ స్థితిలో నేనుంటే ఈసరికి అరడజను మంది గుంటల్ని సూసి వుండేవాణ్ణి!" అన్నాడు కనకం!

కనకం పంచరు కొడతాడు! వాహనాలన్నింటికీ!! చేత్తో ట్యూబుతో!

మనుషులికీ, గాలి కొడతాడు, మాటల్తో!!

అది కనకం 'బిరుదురెటు!!'

"పోనీ....నీ స్థితిలో యిప్పటికెందర్ని చూసేవు?" అనడిగేడు, తను గొప్ప కుతూహలంతో!

వేళ్ళు లెక్కబెట్టి .... "రెండు .... అంతేరా! రెండేరా!"

అన్నాడు కనకం విచారంగా.

"టావున్నారాళ్ళు?"

"ఏటి? మొకాలా?"

"వూఁ...."

"నీ మొకం! ఆళ్ళ మొకాలెందుకు మనకి? కాడు కడతాఁవా? పుటోల్ని డింపుతాఁవా?"

తనెంతో ఆశ్చర్యపోతూ చూసేడు కనకాన్ని.

"మరయితే?...."

"అదిగంతే! సూడు! వొంకాయలు నిగనిగ లాడ్తూ నిండు గుంతే అడిగిన డబ్బులిచ్చే తీస్కుంటాం! మట్టగిడిసలు మజాగుంటే మారు మాటాడకుండా పుచ్చుకుంటాం!"

కనకాన్ని గొప్ప మహానుభావుణ్ణి చూసినట్టు చూసేడు తనప్పుడు!

"ఏంటోరా, రాజూ! పెళ్ళి పేస్కుందారాంటే డబ్బులేదు! "అద్దె మొగుణ్ణి" అవుతూంటానప్పుడప్పుడూను! ఏం చెయ్యను!? ఏం? ఏంటలా సూ స్తన్నావు? నీకూ కావాలేంటి?"

ఎర్రబడ్డ మొహంతో బుర్ర వూపేడు.

"రై టో! రేపటికి రెడీగుండు."

ఆరోజు....ఆ అనుభవం, తనని ఆ తర్వాత చాలా రోజుల దాకా ప్రశాంతంగా, నిబ్బరంగా, తేటగా వుండనిచ్చింది....

మళ్ళా....మళ్ళా లోపలేదో దొలవడం మొదలు పెట్టింది.

"కావాలి, కావాలి!" అన్పించింది. తనమీద తనకే విసుగే సింది. తనంటే తనకే ఆశ్చర్యం పుట్టింది!....ఎంత నిలదొక్కుకో బోయినా వుండడం చాలా కష్టమయింది!! మిఠాయి చూస్తే తినా లన్పిస్తుంది. ఓసారి తింటే, మళ్ళా కావాలన్పిస్తుంది.

అన్నం—నీళ్ళు—ఆడది—డబ్బు—

కోరిక మనిషి నీడ. వాడు పూర్తిగా కాలిపోయినప్పుడే అదీ అంతం అవుతుందంటే!!

కనకానికి చెప్పేడు తన గోడు. "రై టో" అన్నాడే గాని, రై టవలేదీసారి. "గురూ! కొంప మునిగింది! వూర్లో రెయిడింగు ఎక్కువగా వున్నాది! మనకింక గతినేదు!" అని చెప్పేసేడు కనకం.





వుసూరుమని నిట్టూర్చేడు. కనకం అదోలా నవ్వేడు.

"గురూ! ఈ సలక్కొట్లు ఎందుకు? సుబ్బరంగా పెళ్ళి చేసేస్కో! నీకేం? నాకంటే వయసే గదా? మీ షావుకారికి చెప్పు! పనిచ్చినట్టే. మంచి పిల్లని కూడా యిస్తారు!" సలహా యిచ్చేడు!

షావుకారికెలా చెప్పడం?!....

కదిపితే కస్సుమంటాడే!

ఒక్క రోజు నిండా శెలవు ఇవ్వడే!

శెలవంటే తను బడ్డీమీద వుండకపోవడం! అంటే తనకి స్వేచ్ఛ! సుఖపడడం! తను సుఖపడితే....ఒక్క రోజు....షావు కారు చూడలేడే!!

మరి తను జీవితమంతా సుఖపడతానంటే అతగాడు ఒప్పు కుంటాడా? ఓర్వగలడా?!....పెద్ద చిక్కే!! నారాయణ ససేమిరా ఒప్పుకోడు! తను పెళ్ళి చేసుకోందికి! పెళ్ళయితే తనకి కుశాసా లెక్కువపుతాయి! బడ్డీమీద రోజంతా కూచోలేడు! వ్యాపారం నష్ట బోతాది! నారాయణే బడ్డీ ఎక్కాలి! అది అతగాడు చెయ్యలేని పని!! అవతలా హోటల్ చూస్కుంటాడా? ఈ బడ్డీయే చూస్కుంటాడా? తన చుట్టాలమీదాడికి నమ్మకం లేదని తనకి తెల్సు! ఓసారి ఆళ్ళ నెవుర్నో బడ్డీమీద కూచోబెడితే దివాలా తీసినంతా చేసేసేరుటాళ్ళు! దాంతో హడలిపోయి, చుట్టాలకోదండం పెట్టేసేడు! తనమీద నమ్మకం వుంచి బడ్డీ అప్పగించేడు! సాయంత్రం లెక్కలన్నీ కరక్టుగా చూస్కుంటాడు వచ్చి!! పావలా తేడా వస్తే పాతికసార్లు సాధిస్తాడు!! అంత వ్యాపారి!!

రాజు బుర్ర గోక్కున్నాడు.

ఆయనగారికి చెప్పేదేంటి!?....తను అన్నం తింటాను, ఆకలేస్తే! అదాయనకి చెప్పే చేస్తున్నాడా?!....

కనకం తనకి తెల్సిన ఒకాయన్ని మధ్యవర్తిగా పెట్టించి, మాట్లాడించేదో పెద్ద మనిషితో! అతడు కూరల వర్తకం చేస్తు న్నాడు. అతనికి నలుగురు కూతుళ్ళున్నారుట! పెద్దమ్మాయి గుమ్మడి కాయలాగుంటుంది! రెండోది నీటి వంకాయలా వుంటుంది! ఇంకో మూడో పిల్ల లేత బెండకాయే! నాలుగు-చిన్న టమోటో పండులా వుంటుంది, ఎర్రగా!

"నీకేంకొంప మునిగిపోయిందిప్పుడు?" అంటూ రాజుని
ప్టేడు అతను, రాజు తన పెళ్ళిగురించి చెబితే.

రాజు ఎందుకు చెప్పానా? అని మథనపడ్డాడు.

అక్రితం రోజే నారాయణ రెండోకూతుర్ని చూసుకొండికి
చ్చినవాళ్ళు, పిల్లతండ్రి మొహంమీదే "మీపిల్ల పచ్చలేదుమాక"ని
ండబద్దలు కొట్టినట్టు చేప్పేసారు. దాంతో నారాయణ పిచ్చెక్కిన
డిలాకాప్సేపు యింట్లోనూ, కాస్సేపు తన పనివాళ్ళముందూ చిందు
సాడు.

రాజు "ముచ్చట" ని మొదలంటా కొట్టిపారేశాడు. రాజు
న మిత్రుడు కనకంతో చెప్పుకున్నాడు తన బాధని.

"నీకో వుపాయం చెప్తాను, గురూ. నేనియ్యాళ నీ బడ్డీ
మద కూచుంటాను. నువ్వు నీ డార్లింగ్‌తో సిన్మాకెళ్ళొచ్చేయ్,
ంతే !! మీ షావుకారికి తెలవదులే. సాయంత్రం నువ్వు బడ్డీ
దకొచ్చి కూచో. మీ షావుకారప్పుడు గానీ బడ్డీ కాడికి రాడు
దా ? ఏటంటావు ?"

"రైటో !" అన్నాడు రాజు వుత్సాహంతో.

పుదయం మామూలుగా బడ్డీ వోపెన్ చేసేశాడు తను.
కనకం వస్తే బడ్డీ ఒప్పచెప్దామని, ఎదురు చూస్తున్నాడు. ఆడు తొర
గానే వొస్తానన్నాడు, మరి. ఏంటో. యింతదాకా రాలేదు !!
ఏమైంది ?

రాజు గుండె నిండిపోయిన కోరికతో, ఆత్రంతో చూస్తు
న్నాడు, కనకం రాకకోసం....

ఎండ ఎంతో ముదిరిపోయింది. రోడ్డు మీద రద్దీ మరీ
పెరిగిపోయింది. గాలి తుపాకి వేస్తే దొరక్కుండా పారిపోయిం
దెక్కడికో. వుక్క. చెమట. ఈ వూళ్ళో ఈ సముద్రం కాదు
గానీ, వూరంతా వుప్పగాలే. వుష్మదంవే. దీనమ్మా...." రాజు
విసుగ్గా, కోపంగా బుర్ర గోక్కున్నాడు. ఓ అట్టలాంటిది తీసి
విసురుకున్నాడు. బడ్డీలో ఫాను కరెంటు పోయి, ఆగిపోయింది.

ఎవరెవరో వొస్తున్నారు బడ్డీ దగ్గరికి. కొంత మంది
బీడీలూ, సిగరెట్లూ, చుట్టలు కాలే చేంతాడుతో ముట్టించుకుంటు
న్నారు. అది కాలి, కాలి తరుగుతోంది. సుఁసుర కాల్తోంది....

రాజు ఇంకో బీడీ అంటించుకుని, చేంతాడుని నిర్లిప్తంగా చూసి వదిలేశాడు.

కనకం మాత్రం రావడంలేదు। ప్చ్।

రాజు బడ్డీ దిగేడు. ఎండలో చెయ్యి కళ్ళకి వారగా అన్చి, దూరానికి చూసేడు. ఎవరో వొస్తున్నట్టుందే!! కనకం సరిగ్గ లాగానే వున్నాడే!! తన తపస్సుకి మెచ్చి దేవుడు ఆకాశం నుంచి దిగి, నవ్వుకుంటూ తన దగ్గరికి వొస్తున్నట్టనిపించింది। కనకం!! అవునవును ఆడే!! కనకంగాడే!! కనకంగాడు। కనకం యిప్పుడు దేవుడే, తన పాలిట।।

రాజు గుండెలో పళ్ళా సంతోషం ప్రవేశించింది, తలుపు తట్టుకుని. కళకళ్ళాడింది మనసంతా. వుషారుగా ఈలేసేడు, అమ్మయ్య! ఇంతసేపటికి ఈడికి తీరుబడి అయ్యిందన్నమాట। ఎధవకి! బాగా బద్దకం లావయిపోనాదీ మధ్యన! ఎంత ఆరాటం పెట్టేడూ తనని, వుద యిన్నించీనూ!? అస్సలు రాడనుకునీ, ఎంతో దిగాలపడి పోయేడు! పోనీలే వచ్చేడదే పదివేలు!! ఇప్పుడింకా పద కొండు అవుతుందేవో?! మేటినీకి చాలా టైముందిలే!

"ఏరా! కనకం? యింతసేపయిందేం? పొద్దున్నే నగా వస్తానన్నావు? సూడు! నీ కోసం చూస్తూసీ నా కళ్ళు కాయులు కాచి యినై!"

కనకం నవ్వలేదు। నోరు విప్పలేదు।

అడుగులో అడుగేస్తూ వచ్చేడు!!

"ఏరా? ఏ టైంఏరా? ఏం? ఒంట్లో బావులేదేట్రా?" చెయ్యి కనకం చెంపమీదా, పొట్టమీదా తాకించేడు వేడిగా ఏం లేదే। మరేమైందీడికి??

"కనకం। నోరిప్పరా? ఏమైందిరా, నీకూ?" గాభరాగా అడిగేడు రాజు.

కనకం "ప్చ్!" అని నిట్టూర్చి, రాజుని నిలువునా చూసి, "రాజూ! నే నింతదాకా రాకపోడానికి కారణం ఏంటో తెల్సునా?" అన్నాడు. "వూ!? ఏంట్రా?"

"నేన్నీ దగ్గరికి అస్సలు రాకండా వుండాలనే!"

"ఏంట్రా? సరిగ్గా చెప్పు!"

"వొ స్తే నీకు సెప్పేయాలి! సెప్పక తప్పదు! ఎలా సెప్పను
నా నోటితోను!"

రాజు గుండె గుభిల్లుమన్నాది.

ఇందాక ప్రవేశించిన సంతోషం మళ్ళా వేగంగా వె
పోతోంది!! కనకం ఒక్క నిమిషం ఆగి అన్నాడు.

రాజూ! నీ దురదృష్టం నిన్నింకా వొదల్లేదు! నీ కింకా
సంతోషం రోజులు రాలేదు!"

రాజు నీరసంగా అయిపోసాగేడు. నిలబడలేనట్టు వెళ్ళి బ
మీద కూలబడి పోయేడు. కనకం నిట్టూర్చాడు.

"రాజా! నీకు నిశ్చయం చేసిన ఆ అమ్మాయి.... నీతో
రోజు మేటినీ సినీమాకి రాబోయే పిల్ల ఏం చేసిందో తెల్సా?...

రాజు చెవులు, కళ్ళు కనకంవైపే కేంద్రీకరించబడినాయి
"... నిన్నరాత్రి యింట్లోంచీ చెక్కేసింది! తెల్లారే సరికి పక్క
లేదు!! ఇంట్లోగాబరాపడిపోయి, వెదికేరు! ఆపేటలోనే
కుర్రాడూ కన్పించలేదుట! ఇంక నేన్నీకు చెప్పక్కర్లేదు!"

కనకం అడుగులో అడుగేస్తూ వెళ్ళి పోతున్నాడు.

రాజు కళ్ళు కనకాన్ని చూస్తున్నాయి. కళ్ళల్లో కనక
చెవుల్లో వాడిమాటలు....గుండెలో కోరిక....బడ్డీముందు ఎవరె
.... ....వొస్తున్నారు. వెడుతున్నారు....చేంతాడు కాల్తోంది. కా
వాళ్ళకి నిప్పయిస్తోంది. కాల్తోంది.... .... ....

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B122 |
| పుస్తకం పేరు | మబ్బు వీడిన సూర్యుడు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | |
| ఖాళీ పేజీలు | |
| లేని పేజీలు | |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | K DANCOD |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |